...యై నమః

...వతంస

శ్రీ రాజా

# వేంకటకృష్ణారావు

## బహద్దరువారి జీవితము




'శ్రీనాథునకుఁదక్క నేనరేఁడునకేని
భయ మందనల దంచుఁ బలుకువాఁడు'

గ్రంథకర్త:
వాజపేయయాజుల రామసుబ్బారాయఁడు, బి. ఏ.,
కొల్లాపురము

శ్రీజటప్రోలు రాజసంస్థానమ
1937



SREE RAJAH
INUGANTY VENKATA KRISTNA RAO
*Bahadur Varu*
Zamindar of TIRUPACCHUR ESTATE
Born 30-5-1899

ఓం

# తొలిపలుకు



విషాదాంత మగు నీజీవిత చరిత్రకుఁ దొలిపలుకు వ్రాయుపని నాపయిఁ బెట్టఁబడుట దురదృష్టఫలము. ఇది నా కనభిమతమయ్యు గ్రంథకర్త్ర్యస్నేహ లతావృతుఁడనై యనుమతింపక తప్పినది గాదు. ఎట్టి స్వీయాపద్విషమపరిస్థితులందేని గన్ను తడిగానీక సహించుకొను కఱకుఁదన మవలంబించుటకుఁ గొంత యభ్యాసపడినను బరాపద్విషమపరిస్థితులయెడ మాత్రము నేను బొత్తిగఁ బరిహాసపాత్రుఁడనే. గ్రంథస్థము లగు నల్పప్రాణి వికటావస్థలం బ్రత్యక్షీకరించుకొని తడవు దురపిల్లు నేను, స్మరణమాత్రమునన ముహుర్ముహుర్నిశ్చేష్టతం గలిగించుచు నొకయెడ నూర్ధ్వలోకమునకును, మఱొకయెడ నధోలోకమునకును లాగికొనిపోవుచు ననంతచింతాడోలికల నూచివైచు నేతత్కృతికి నిజప్రకృతివిరుద్ధముగఁ దొలిపలుకు నిబంధించునంత కఱకుఁదన మెట్లవలంబింపఁగలనా యని యేమియుఁ దోఁచక బహుదివసములు పడియుంటిని. బుద్ధి స్తంభించెను. మతి చెడినట్లయ్యె. దిక్కుం దెరువులు గానఁబడవయ్యె. బలాత్కారముగఁ బట్టిన లేఖిని బట్టు సడలి పడిపోఁదొడఁగె. ఒప్పించి నన్నాఁడింపఁగలవా రెవరు? సుఖులమని భ్రమించు సఖులందఱును దుఃఖులే యైయుండ వారా నన్నాశ్వాసించువారు? కొలఁదిదివసములకు నా

సమయములును, బట్టఁజాలక యేకాంతమున నేకధారగఁ గన్నీరు గార్చిన యవసరములును, వావిడిచి హాహారుత విలపించిన సందర్భములును, గాలుసేతు లాడక కట్టివారి పోయిన గడియలును, నుత్కంఠాభరమునఁ గంఠము కుంఠితమైన మూర్తములును, నుచ్ఛ్వాసనిశ్వాసములు నిలిచి పోయి యుక్కిఁరిబిక్కిరియైన యవకాశములును బట్టబయలై పట్టరాని విచారమును గలిగించకపోవు. నిగ్రహసమర్థులగు సుబ్బారాయఁడుగారిన్ని దురవస్థల దురపిల్లుచుంగూడఁ గావ్యమర్యాదానుసారముగఁ గొన్నిఘట్టములను గల్పించి, నాయకమణి చరిత్రమును బాల్యప్రభృతి పర్యవసాన పర్యంతముఁ బెంపొందించి, దైవ మనుల్లంఘనీయ మనియు, నెట్టి పురుషకారమును దానికి లొంగిపోక తప్ప దనియు, సుకృతులకు సర్వార్థసమృద్ధి పిన్నతనముననే సిద్ధించు ననియు, సత్యశీలుఁ డగువిక్రమసంపన్నుఁ డతఁడయ ప్రతిష్ఠం గాంచు ననియు, బహుపండితకవిమిత్రుఁ డమృతత్వముం బడయు ననియు- నిట్లెన్నియో మహార్థవిషయవిశేషముల ధ్వనింపఁజేయుచుఁ దమకృతినిర్మాణకౌశలముం జూపిరి. వీరు జటప్రోలు సంస్థానమున గురూద్యోగపదవిం బడసినది మొదలు కీ. శే. శ్రీరాజా సురభి లక్ష్మారాయ ప్రభుచంద్రులయొక్కయుఁ, బిదప శ్రీశ్రీశ్రీ మహారాజ్ఞిరత్నమాంబాసతీమతల్లి యొక్కయు, మఱియు శ్రీకుమారరాజా వేంకటజగన్నాథరావు బహదరుగారియొక్కయు సంపూర్ణాదరగౌరవములచేతను, గృపావలోకనములచేతను దమ సహజ భాషాసేవాసక్తిని బెంపొందించి, మిత్రలేఖవ్యాప్తిచే బహు

గావింపఁబడినకావ్యము లన్నియు మఘలోఁ బొడమి పుబ్బలో నడఁగు పుట్టకొక్కులవలె నింద్యములై క్షణికములై యధమాధమములుగ నధఃకరింపఁబడునని వేఱ వచింపనేల?

సంప్రదాయరహస్యోపచితముగ శ్రద్ధాభక్తుల వాగ్దేవతోపాసనగావించుమహాకవులకు సన్నాయకరత్నప్రాప్తియే తపఃఫలము. దాననే వారికి రససిద్ధి. దాననే వారికిఁ జిరంజీవిత్వప్రసిద్ధి. దాననే వారికి జరామరణభయానవిద్ధయశశ్శరీరలబ్ధి. వాల్మీకికి శ్రీరామచంద్రమూర్తియు, వేదవ్యాసులకు శ్రీకృష్ణపరమాత్మయుఁ, గాళిదాసునకు దిలీపరఘురామ ప్రముఖమహారాజరాజియుఁ దత్తత్ప్రబంధనాయకమణులుగ దొరకుట తత్సారస్వతతపఃఫలసిద్ధిగాక వేఱేమి? వారలనిర్మాణకౌశల మెంతయపూర్వముగ నుండినను నట్టి పుణ్యశ్లోకనాయకసిద్ధియే గలుగకుండిన వారలమహాకావ్యములకు, ము౦ దెట్లుండఁబోయినను, నాఁటినుండి నేఁటివఱకు నింతటిగౌరవాదరము లుండునా? ఇట్టి సనాతనపరంపర నాదర్శముగఁ గొనువా రేనాఁటికిని ధన్యులే. బ్ర. రామసుబ్బారాయఁడుగా రిట్టికోటిలోఁ జేరినధన్యు లగుటయేగాక స్వాభివర్ణితనాయకమణికి సాక్షాన్మాననీయులును, దత్ప్రియాపత్యగురువులు నగుట ధన్యతము లనఁదగు.

కావ్యసృష్టి బ్రహ్మాండసృష్టివలె విశిష్టానల్పపదార్థశిల్పోత్కృష్టమై, యచింత్యావ్యక్తరచనా ప్రపంచితమై, నానాభూతకళాకల్పమై, రసజ్ఞానందకందమై, యనాద్యనంతమై యొప్పుచుండు. ఏతదారంభపరిణామాది వాదోపవాద

రైనను దమ్ముఁబోలు ననుత్పన్నమతులకు శ్లాఘాపాత్రు లయినను దోషజ్ఞులకుఁ బరిహాసపాత్రులు కాకపోరు. శ్రీ రామసుబ్బారాయఁడుగా రేతద్రిహస్యసాంగవిదులని శ్లాఘించుట కేతత్సత్కృతియే సంపూర్ణనిదర్శనము. ఇట్లగుటనే యీనవ్యకావ్య మొకవైలక్షణ్యముం గలిగి యెంతయు శోభించుచున్నది.

ఈగ్రంథకర్త స్వీయానుభవమున సంతరించిన యీ కృతి మహనీయచరితు లగు శ్రీరాజా ఇనుగంటి వేంకటకృష్ణ రాయబహద్దరుగారి జీవితచరిత్రమగుట దీనియం దాయుత్తముఁ డొక్కఁడే ముఖ్యముగా నభివర్ణింపఁబడియెను. పఠించి చూడ శ్రీవారిగుణగణములు బాల్యప్రభృతి గణనీయము లగుట సుస్పష్టము. అవగుణ మొకటియు నుల్లేఖింపఁబడకుంట యజ్ఞుల కతిశయోక్తిగఁ దోఁచవచ్చునేమోగాని మహా పురుషచారిత్రవిజ్ఞుల కది స్వభావోక్తిగనే తోఁచును. ఒక వేళ నేదేని గొండొకలోపమే యుండినను 'ఏకోహి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంక' యనునట్లది యీమహితుని సుగుణసహస్రమున నంతర్హితమయి యుండుట స్వతస్సిద్ధము. మహాధీరుఁడును, దీనబాంధవుఁడును, నుదార మూర్తిశేఖరుఁడు నగు నీరాజసింహుని సుగుణసంపత్తి యీ కృతియం దన్నిఘట్టముల విస్తరింపఁబడియుంటచే నే నిందు దాని నెత్తిచూపుట స్వారస్యభంజక మని యుపేక్షించుచున్నాఁడ. పలువుర నుద్ధరింప సమర్థుఁ డగునిట్టిపుణ్యాత్ముఁడు పదికాలములపాటు వర్ధిలుట సర్వసజ్జనాపేక్షిత మయ్యును

యువు రెల్లరు సుకృతులే యగుచుందురనికాని నిర్ధారింపవు. ఈవాక్యార్థవిచార మెట్లున్నను మఱి యింకేది యెట్లున్నను ననితరానేకసుగుణోపేతులు, నత్యంతసుకృతులు నగుశ్రీ రాజాగా రింతపిన్నవయసున దివంగతులగుట సమకాల వర్తుల మగుమనకు మిక్కిలి శోచనీయ మనక తప్పదు. పరిచితాపరిచితు లగు నానాప్రాంతీయులు, నానాజాతి మతాచారపరులు, బంధుమిత్రాప్తులు, సామాన్యులు, మహా మహులు, మహోద్యోగులు, పండితులు, కవులు మున్నగు వారు శ్రీవారి హఠాద్వియోగమున కనుతపించుచుఁ బ్రక టించిన యిందలి గద్యపద్యరచన లీయంశమునకుఁ బ్రత్యక్ష సాక్ష్యము.

ఇఁక నీకృతివిశ్రుతికి ననితరప్రథితము, నసాధారణము నగు గొప్పవిశేష మింకొకటి గలదు. దాని నుపశ్లోకింపక నాతొలిపలుకు ముగించుట యనుచితము. అది యీకృతి కొక యపూర్వవైలక్షణ్యముం గలిగించుచున్నది. కాని పాఠకుల కది యత్యంతవిషాదజనకము, హృదయవిదారకము ననక తప్పదు. అది యకృత్రిమము, ప్రకృతిసిద్ధము, అవ్యాజా వ్యక్తాక్షరకలితము,అనుభూతాశేషవిశేషసన్నివేశసంబద్ధము. ఇట్లగుట నయ్యాలాపస్పర్శ మొకింత గోచరమగునేని భూమి భేదిల్లకపోదు ; పాషాణము ద్రవించకపోదు ; వజ్రము వ్రక్కలు గాకపోదు. ఇట్టిచో నిఁకఁ బిఱికిగుండెలు పిండిపిండి గాకుండు టెట్లు? తనతోడిగిజిగాడు ముహూర్తము గానరా కున్న నెలుంగు రాల్పడఁ బెంటిపులుఁగు గిలగిలలాడుఁగదా!

లోకసాధారణ స్త్రీవిలాపసందర్భములందె యిట్లుండ నీకఁ
బతివ్రతాశిరోమణియు, నబలయు, నసూర్యంపశ్యయునగు
శ్రీసరస్వతీ సతీవిలాపము కర్ణతాడితమై విదీర్ణేంద్రియులు
గానిప్రాణు లెందును నుండఁబోరన సందియమేమి?

నిత్యప్రార్థనారూపమున నిందుఁ గానవచ్చుగ్రంథ
భాగమంతయుఁ దద్విలాపకలాపమె. ఇం దీ యినుగంటిరతి
కొన్ని యెడల విశ్వమును మఱచియుఁ, గొన్ని యెడలఁ దన్నుఁ
దా మఱచియు, మఱికొన్ని యెడల సర్వమును మఱచియు
హృదయేశ్వరతన్మయతం గాంచుట గోచరించు. అసా
మాన్యానేకగుణవిభ్రాజితులై, సర్వస్వమూర్తులై, యప్రాప్త
చత్వారింశదబ్దమాత్రులగు శ్రీవేంకటకృష్ణారావుబహాదరు
గారి వక్షస్తల్పదూరీకృతయగు నాయల్పభాగ్యదీనాలాపము
లెంత కరుణరసవిలసితములై యుండునో యభిజ్ఞు లూహిం
పఁదగునేగాని నా కనువదింప నోరాడదు. నిజశోకము నీ
కృతిముఖమున వెలువరించి శ్రీసుబ్బారాయఁడుగారు కొంత
శాంతిం గనుట నుపలక్షించియె కాఁబోలు నీయమయుఁ దన
శోకము నేతన్ముఖమున వెలువరించినది! దయామయుఁడగు
సర్వేశ్వరుఁడు ప్రార్థిత మనశ్శాంతి నీయమ కనుగ్రహించుఁ
గాక! తత్ప్రాణేశ్వరులగు శ్రీవారి కక్షయపుణ్యలోకవిహా
రముతో సుస్థిరాత్మశాంతిం బ్రసాదించుఁగాక! శ్రీవారి
సంతానము ననంతతంతుసంతతముగ నాచంద్రార్కము వర్ధి
లఁజేయుఁగాక! మూఁడుగాళ్ళముద్ద లగు శ్రీవారితలిదండ్రు
లకు ముక్తిమార్గ ముద్బోధించి సమాహితచిత్తులం జేయుఁ

# రసాస్వాదనము



శేషాద్రిరమణ కవులు, శతావధానులు.

క. ఇనుగంటికృష్ణభూవిభు
జననమ్ము విమానయానచాతుర్యంబున్
మనికితము నూత్నకృతిగాఁ
దెనుఁగున రచియించె సఖుఁడు తియనినుడులన్. 1

మ. రసవంతం బగుశైలిఁ గృష్ణవిభుశూ
రత్వంబు సాహిత్యమున్
రసికత్వంబుఁ బ్రశంసఁజేయుచుఁ గృతిన్
వ్రాయించె రత్నాంబ రా
జ్ఞి సమంచన్మతి రామసుబ్బకవిచే
స్విన్నాశ్రుధారాప్లుతుల్
బొసగన్ దాన సతీవిలాపకథనం
బున్ జూచి నేఁ గుందితిన్. 2

సీ. ఖ్యాతిమీరఁగ నినుగంటివంశాంభోధి
జైవాతృకుం డన జననమొంది
సురభి లక్ష్మారాయనరపాలపుత్రికా
మణి సరస్వతిని బ్రేమను వరించి

గీ. నిట్టియుత్తమసాధ్వి కహీనభర్తృ
చరణకంజాతసేవనాసక్తహృదయ
కీసరస్వతీరాజ్ఞికి నేల యిట్టి
పతివియోగంబుఁ గూర్చెనో పద్మభవుఁడు. 5

చ. అనితరభర్తృదుఃఖకలితాశయ యైనసరస్వతీమహా
జనని విచారభారమున సారె కొనర్చువిషాదగీతికల్
వినినకొలంది కన్నుఁగవ వెల్లువలౌ నిబిడాశ్రువుల్; దయా
ఖని యగు నేని యావిధికిఁ గల్గదె జాలి రవంతయేనియున్.

మ. ఇది కర్మానుభవం బటంచు మది నూ
హించెన్ దదర్ధాంగి, దు
ర్విధికృత్యం బని యెంచెనేని కవితా
విఖ్యాతశాపోక్తిచేఁ
దుదిముట్టింపదె నల్వనేని కవితా
స్తోకప్రభావంబుచే
బ్రిదికింపన్ వెనుదీయునే పతిని వి
ద్వల్లోకగేయంబుగన్. 7

మ. రసవత్పద్యవిషాదగానమున వీరగ్రామణిన్ గృష్ణభూ
పసునాశీరు నమోఘజీవితుని నల్వన్ నేర్చినావమ్మ! భ
వ్యసమంచత్కవితాప్రపంచమున నీప్రాణేశ్వరుం డాధరా
శశితారార్కము నిల్వఁగాఁ గలఁడు శశ్వత్కీర్తితో మాతరో!

# ఆత్మవాక్యము



ఉ. శ్రీరమణీమనోహర! సమృద్ధభవత్కృపఁ గైత సెప్పఁగా
నేరుపు గల్గె నించుక; మనీషులు, భూవరు, లార్యసత్కవుల్
వారక ప్రోత్సహింతురు శుభస్థితి దీవన లిచ్చి; యందుచే
నూరక వ్రాయుచుందుఁ గల మోపినరీతిగ నెల్లవేళలన్.

ఉ. పోతనభాస్కరాదికవిముఖ్యులవోలెఁ గవిత్వ మల్లఁగా
నాతరమౌనె? యిట్లని మనమ్మునఁ బెద్దిగులొంది మానఁగాఁ
జేతము సమ్మతించునె? విచిత్రముగాదొకొ దైవసృష్టి? యె
ట్లే తగురీతి నుండునని యెంచి రచింపఁగ సాహసించితిన్.

ఉ. ఎట్టులొ నాపురాకృత మహీనఫలంబునఁ బుణ్యచేత నే
నెట్టనఁ గాంచినాఁడఁ దగుస్నేహము సత్కవిరాజుతోడ, నె
ప్పట్టుననింక వారలను బాయక కొల్తుఁ, దలంప నొందు; నా
కిట్టులె శాంతిసౌఖ్యముల నేగినఁ జాలును జీవితం బిలన్.

సీ. కవిరాజబుధగురుస్తవనీయకీర్తివై
భవశాలి కవిసార్వభౌముకరుణ
శతలేఖినీపద్యసంధానదక్షులౌ
తిరుపతి వేంకటేశ్వరులకరుణ

ఉ. ముప్పదియాఱు గ్రంథములు మోదమెలర్పఁగ వ్రాసినాఁడ నే
రొప్పినరీతి సత్కవుల హెచ్చుతగు ప్రీతిఁ బ్రమోదపత్రముల్
చొప్పడఁజేసి రెంతయు విశుద్ధమనమ్మున, భక్తిభావముల్
తప్పకచూపుచుందు సతతంబును వారికి వారివారికిన్. 8

మ. కలకాలమ్ము వ్యయప్రయాసములకుం గాసంతలోపింపకే
కలలం దైనఁ గవిత్వతత్త్వవిలసద్గ్రంథంబు లేపారఁగా
లలిఁ జేయందలపెట్టినాఁడఁ బుడమిన్ లక్ష్యంబు సూత్రించి శ్రీ
లలనారత్నము ప్రోత్సహింప సఖులాహ్లాదంబునం జూడఁగన్

ఉ. వైదికమార్గవృత్తియనఁ బ్రాణము నాకుఁ బఠింపలేదొగిన్
వేద మొకింత, తెల్గునఁ గవిత్వ మెటో లభియించెఁ బొట్టకై
మేదిని నాంగ్లవిద్యయును మేలగు 'పాళియు' సంస్కృతంబునం
దాదృతిఁ జేసికొంతయును నభ్యసనం బొనరించి పెంచితిన్.

ఉ. ఇంతకు నాంగ్లభాషకయి యెక్కుడుకాలము పుచ్చినాఁడ నే
నంతటఁ బట్టభద్రపతి నైతిఁ గవిత్వము నీడవోలె న
న్నెంతయు వీడకుండె; నటు లేనును దానిని బెంచినాఁడ; జ
న్మాంతరదోషముల్ దొలఁగునంచు భజింతు నిటుల్ సరస్వతిన్.

ఉ. ఆవల నూజివీడుపురమందునఁ బావనధర్మశీలుఁడౌ
శ్రీవిజయాప్పరాణ్మణివిశిష్టకృపన్ గురుతన్ వహించుటన్
శ్రీవిభవంబుఁ గాంచితిని జేకుఱె మైత్రియుఁగూడ; నంతటన్
దైవదయావివృద్ధి నరనాథునిఁగొల్చితి లక్ష్మరాణ్మణిన్.

గీ. క్రమముగా విశ్వవిద్యాధికారు లెల్లఁ
బాఠ్యపుస్తకములుగ మాప్రబంధములను
నిర్ణయించి ప్రోత్సాహమ్ము నించుకతన
వృద్ధియగుచుండె నాసంఘ మెంత యేని. 18

ఉ. ఆపయిఁ గొంత ధైర్యముదయంబయినంతట నేను వెంటనే
స్థాపనచేసితిం గవనసంఘ మొకండు విధేయశిష్యులున్
శ్రీపతులున్ సుహృద్వరులుఁ జేకొని దానిని వృద్ధిసేయ భూ
మీపతి కృష్ణరాణ్మణి తమిన్గొని మెచ్చికొన న్బ్రియమ్మునన్.

ఉ. మెచ్చుటెకాక న న్బిలిచి మేదురభక్తిని గారవించి వి
ద్వచ్చయగేయ! నీకృతులపారముదమ్మునఁజూడఁగంటి ని
న్మెచ్చిరి పెద్దపెద్దలవనిన్ యశమెంతయొగాంచినాఁడవో
సచ్చరితాగ్రగణ్య! యని సన్నుతిఁజేసె ననేకరీతులన్.

గీ. గారవంబునఁ బ్రతిశుక్రవారమందు
నన్నుఁ బిలిపించి సద్గాథ లెన్నియేని
విన్పు మని కోరుచుండె సంప్రీతితోడ
నటులె వినిపించుచుంటి నాహ్లాద మొదవ. 21

ఉ. వేఱొకనాఁడు న న్బిలిచి ప్రేమదలిర్పఁగ మాటలాడి దై
వారినభక్తితోడ గురువర్య! కవిత్వపటుత్వతత్వమున్
వారక చెప్పుమం చనఁగ బాష్పసమంచితలోచనుండనై
యూరకయుంటిఁ గొంతతడ వోపికఁబట్టుచు సమ్ముఖమ్మునన్.

ఉ. ఇంతకుమించుభాగ్య మొకఁడేనియు లేదనినిశ్చయించి యా
త్యంతముదమ్ముతోడ దినమంతయు యోజనసేసినాఁడ సి
ద్ధాంత మొసర్చుకొంటి గుణధాముఁడుకృష్ణునకు న్గురుండుగా
నెంతటివారి కబ్బునని యెంతయు హర్షపయోధి మున్గితిన్. 28

శా. కానీ దైవ మసూయచేత నిటులాకార్యంబు సాగించుభా
గ్యానందమ్ము నొసంగఁడాయెనని హాహాకారముల్ సేసి భూ
జానిన్మ్రింగినచండమృత్యువునకై స్వాంతమ్మునంగుందుచున్
నానారీతుల దుఃఖ మొందితిని కృష్ణారాయనిం బాయుటన్.

ఉ. ఆవలఁ గొన్నినాళ్లకు దయామతి శ్రీమతి శ్రీసరస్వతీ
దేవి యనుగ్రహమ్మున మదిన్గలచింత యొకింతపోయె న
న్నావరమానినీమణియు సాదర మేదురచిత్తవృత్తితోఁ
బావనధర్మబుద్ధిగొని భక్తిఁదలిర్పఁగఁ జూచు నెంతయున్.

ఉ. వారియుదారభావములు వారిమహాగుణశీలవృత్తముల్
వారివిశిష్టధర్మములు వారివివేకవికాసకాంతియున్
వారిపరోపకారగుణభావవిశాలనయప్రబోధముల్
వారిదృఢవ్రతంబులును వారికె చెల్లునుబో ధరాస్థలిన్.

గీ. ఆసరస్వతీవిగ్రహమా యని జను
లెల్లఁ బొగడుతెల్వినిఁ గాంచె నిలఁ గవిత్వ
తత్వలక్షణమార్గ మంతయు నెఱింగ
నదియ వృద్ధిసేయవలయునంచుఁ దలఁచె. 32

గీ. అకట ! కృష్ణభూజానిఁ బాయంగఁ జేసి
నట్టివిధికృతములకు నేమందు ? నాశ
లన్నియును దీఱె నాకల మాడదాయె ;
నైన ధృతిఁగొంటి నాధన్యు నభినుతింప. 38

గీ. వ్రాయఁబూనితి నిట్లు కావ్యం బొకండు
కృష్ణభూజానిచరితం బదెల్లఁ గొంత
వఱకు గద్యపద్యంబులసరణిఁ జూపి
శ్రీసరస్వతీకరుణావిశేష ముంట. 39

చ. హరికి సమర్పణంబుగ మహాకృతు లెన్నియొ వ్రాసి సత్కవుల్
ధరఁ దరియింపలేదె? వసుధాపతి శ్రీహరితుల్యుఁ డంచు నే
నరసి తరింతునం చిటు మహత్తరజీవితగాథ వ్రాయఁగా
దొరకొని కృష్ణభూపతికె తోరపుభక్తిని నీయ నెంచితిన్.

ఉ. అక్షరకోటి వ్రాయ మనమందున నెంచితి భక్తిపెంపునన్
దీక్షవహించి సత్కృతులఁ దీర్చి రచించెదు వేళలందుఁ బ్ర
త్యక్షరమున్ గణింపఁదగుఁ దత్పరమార్థము రామకోటిగా
నక్షయసౌఖ్యసంపదల నందఁగఁ జేయుత శాశ్వతంబుగన్.

ఉ. ఇంతకు మించి చేయఁగలదేదియుఁ గన్పడఁబోదు నాకు ర
వ్వంతయు జీవనార్థము ధరాధిపుఁడింతయొసంగె భార్యయున్
సంతతియుండె నోపికయుఁ జక్కఁగనుండెఁ గవిత్వముండె నా
కింతటి భాగ్యముంటఁ గృతు లేర్పడ వ్రాసి తరింప నెంచితిన్.

ఇట్లు,
కావ్యకర్త.

ఉ. బాపురెమాతృభాషయనభారముదోఁచినకాలమందుఁగొ
ల్లాపురరాజ్యలక్ష్మిని విలాసముతోడఁ దెలుంగుకైతకుం
బ్రాపొనరించినాఁడవు సెబాసన నీవయి నాంధ్రలోకసం
తాపముఁ బాపి స్నేహలత ధారుణిఁ జల్లఁగ నల్లు నెల్లెడన్.

గుంటూరు. } కాశీ కృష్ణాచార్యులు.
(అవధానిశిరోమణి)



అస్మన్మిత్రవర్యులగు బ్రహ్మశ్రీ వాజపేయయాజుల రామసుబ్బరాయకవివర్యుల సమ్ముఖమునకు:—

ఆర్యా !

శ్రీజటప్రోలుసంస్థానాధీశ్వరుల యాస్థానమునుండి తమచే "స్నేహలతాకవితాసంఘము" 1929 సంవత్సరమున సుప్రతిష్ఠితమైనది మొదలుకొని తాము గావించుచున్న యాంధ్రభాషాసేవను నే నిదివఱకే గుర్తించియున్నవాఁడను. మీకవిత్వమునందు ధారాశుద్ధియుఁ, బాకశుద్ధియుఁ గన్పట్టుచున్నందునఁ దమయనర్గళవాగ్ధారను గడుపారఁ గ్రోలి యానందించుచున్నాఁడను. జటప్రోలుసంస్థానము మాతృభాషాపోషణమున నిదివఱకె కడుంగడు ప్రఖ్యాతిఁగాంచిన దనుట సుప్రసిద్ధచారిత్రకవిషయము. ఏతత్సంస్థానాధీశ్వరులు భాషాభిమానులనుటకుఁ జంద్రికాపరిణయమునే చాలినంత నిదర్శనముగఁ జూపవచ్చును. పరంపరాగత మగు సంప్రదాయమును, భాషాభిమానమును బండితబహూ

# A few facts & Personal impressions

FAVOURED BY

## THE YUVARAJAH SAHEB OF PITHAPUR.



*On my request the Yuva Rajah Saheb of Pithapur, the brother-in-law and a personal friend of the late Rajah, J. V. Kristna Rao Bahadur, supplied me the following facts, his personal impressions which are invaluable in writing a biography. I am much indebted to the Yuva Rajah Saheb of Pithapur for his gracious favour.*

V. R.



I. He is an exceedingly kind friend.

(*a*) Would do all that was possible for friends.

(*b*) Used to spend quite a lot for the sake of friends.

(*c*) Sincerely sympathised with friends in difficulty and helped them.

(*d*) Very rarely he said 'no' to a request from a friend.

II. Was very sociable and was quite popular among the people he mixed with.

శ్రీమత్పరదేవతాయై నమః

# శ్రీరాజావేంకటకృష్ణారావు

## బహద్దరువారి జీవితము

## 1. సారసంగ్రహము



### జననము

శ్రీరాజా వేంకటకృష్ణారావుబహద్దరువారు వికారినామ సంవత్సర వైశాఖబహుళషష్ఠీ కుజవాసరమున (30-5-1899) జననమొందిరి. శ్రీరాజకుమారశుభోదయమున శ్రీమ దినుగంటి వంశపయఃపారావారము దిగంతవిశ్రాంత కీర్తితరంగితమై విశేషపావనతం బడసినది. శ్రీరాజావారి జన్మస్థానము శ్రీవేంకటగిరిసంస్థానము. శ్రీతిరుపాచూరు జమీందారులును, భక్తిజ్ఞాన సంపన్నులును, ధర్మనిష్ఠాపవిత్రారాధన తత్పరులును, నయజ్ఞులును నగు శ్రీరాజా వేంకటరాయనిం బహద్దరుగారు వీరి జనకులు. శ్రీశ్రీవేంకటగిరి మహారాజా బహద్దరుగారి పుత్రికారత్నమగు శ్రీశ్రీ సౌభాగ్యవతి శ్రీరాజ్యలక్ష్మీదేవమ్మగారు వీరి జనని. చిన్నప్పటినుండియు మాతాపితృగురుదైవతములం దనన్య వినయవిధేయతలును, భక్తి

పూవు పుట్టినదితడవుగఁ బరిమళము నల్దెసల వ్యాపించినట్లు ధైర్య స్థైర్య శౌర్య గాంభీర్యాది గుణగణంబులు బాల్యమునుండియే శ్రీరాజావారి ముఖపద్మమునఁ దాండవమాడుచుండె. దైవానుగృహీతములగు నిట్టి సుగుణరత్నములు సద్గురుబోధశాణోల్లిఖితములై యచిరకాలమున నసమాన ప్రభావిభాసమాన దిగంతములై యలోకసామాన్యము లగుటలో నాశ్చర్యలేశముం గాన్పింపదు.

## విద్యాభ్యాసము

శ్రీవారు బాల్యమునందె పఠన, లేఖనాభ్యాసములతోపాటు క్షత్రియవర్ణమున కుచితమగు విద్యాకళల నన్నిటి నభ్యసించి, సాధించి షోడశాబ్దములు నిండువఱకు షోడశకళాపరిపూర్ణులైరి. విశేషశేముషీసమార్జనాసక్తిచే శ్రీబొబ్బిలి సంస్థానోన్నత పాఠశాలయందున్నతవిద్య నభ్యసించిరి. చిన్ననాఁటినుండియు గణితవిద్యయందు వీరిని మీఱఁగల సహపాఠులేతరగతియందును లేరని ఘనత గడించిరి. ఏకసంధాగ్రాహులనియుఁ గుశాగ్రబుద్ధులనియుఁ బదవాక్యప్రమాణవిదులనియు బహుతరముగఁ బ్రశంసింపఁబడుచు శ్రీవా రమితప్రజ్ఞాధురంధరులై యొప్పుచుండెడివారు. పాఠశాలలో నడుగుపెట్టినది మొదలు గురుబోధమునం దేకాగ్రచిత్తులై యుండెడివా రన్న ప్రతీతి గలదు. తోడివిద్యార్థులయం దమితప్రేమమును, మిత్రుల యెడ నమిత విశ్వాసమును, గురువులయెడ నమిత భయ

లును, రాజలోకచూడామణులును, జగద్విఖ్యాతసంపన్నులును, విద్యాప్రియులును నగు శ్రీరాజా సురభి వేంకటలక్ష్మారావు బహద్దర్ నిజాం నవాజ్ వంత్ వారి ద్వితీయ పుత్రికారత్న మగు శ్రీశ్రీ సరస్వతీ అమ్మయ్యగారిని 1917 సంవత్సరమున వివాహమాడిరి. శ్రీరాజా వేంకటలక్ష్మారావు బహద్దరువారికి శ్రీరాజా వేంకటకృష్ణారావుగారు భాగినేయులు. 'మేనమామపోలికలు, మేనత్తచాటికలు వేఱుగా' వన్నట్లు మేనమామగారివలె వీరును సర్వకళలయందును సమర్థులై లోకనుతి గాంచుట సముచితసంప్రదాయపరిప్రాప్తము.

## ధర్మపత్ని

"Friendship, Society and Love
Are Divinely bestowed upon men"

స్నేహము, సత్సాంగత్యము, నిర్వ్యాజప్రేమ-యివి మానవులకు దైవప్రసాదితంబులైనను బురుషులు వీనియం దాత్మవంచితులుగాక లోకమున లోకాదృతితోఁ దమతమ జీవయాత్రను నడుపుకొనుటకు 'గృహలక్ష్మి' ప్రధానావలంబము. శ్రీరాజావారి యుదారగుణమణిగణప్రకాశమును దన మందహాసచంద్రికలచే శతగుణిత మొనర్చు పరమపతివ్రతాశిరోమణి శ్రీవారిని జిన్ననాఁటనె వరించి,యర్ధాంగలక్ష్మియగుట మహాభాగ్యము. శ్రీ సరస్వతీదేవమ్మగారు సాంగవిద్యావతులై తమ నామధేయమును సార్థకముచేసికొనిరి.



శ్రీ రాజాగారి జ్యేష్ఠపుత్రికారత్నము

కాక నిజధర్మపత్నియందుఁగూడ సప్తసంతాన భాగ్యమును గాంచిరి. శ్రీరాజావారికి ముగ్గురు పుత్త్రులును, నలుగురు పుత్రికలును నుదయించిరి.

## పుత్ర రత్నములు

1. శ్రీరాజా మురళీకృష్ణారావుగారు.
2. శ్రీరాజా మదనగోపాలస్వామిగారు.
3. శ్రీరాజా పాండురంగలక్ష్మారావుగారు.

## పుత్రికా రత్నములు

1. శ్రీశ్రీ సౌభాగ్యవతి ఇందిరాదేవమ్మగారు.
2. శ్రీసామ్రాజ్యలక్ష్మమ్మగారు-
3. శ్రీవేంకటరత్నమాంబగారు.
4. శ్రీరాజరాజేశ్వరమ్మగారు.

శ్రీవారి పుత్రరత్నములలోఁ బ్రథమరత్న మగు శ్రీరాజా మురళీకృష్ణారావుగారు.

'రూపం త దోజస్వి తదేవ వీర్యం
తదేవ నైసర్గిక మున్నతత్వమ్
న కారణా త్స్వా ద్బిభిదే కుమారః
ప్రవర్తితో దీప ఇవ ప్రదీపాత్'

మొనగాండ్రవలె నిరంతర మభ్యాస మొనరించుచుండినవార లగుటచే శ్రీవారి మసృణమాంసలోన్నతకాయము తత్సహజ ధైర్యమునకు మఱింతవన్నె వెట్టెను. సింహగంభీరసుందరాననమునకు బుద్ధివికాస మపూర్వాలంకారమయ్యెను. నైతికాచారధర్మపరులై శరీరమును జక్కఁగఁ గాపాడుకొనుచుండెడివారు. శరీరబల మెంతబాగుగ నుండిన బుద్ధిబలమును నంత కెక్కుడుగ నుండునని వ్యాయామశాస్త్రనిర్ణయము. శ్రీరాజాగారీసూత్రమునకుఁ బ్రత్యక్షలక్ష్యమై సర్వవైభవములతో సుఖముగఁ గాలముగడపుచుండెడివారు. గుఱ్ఱపుసవారిలోను, పోలో మొదలగు వినోదక్రీడలలోను దుష్టమృగసంహారక్రీడలలోను శ్రీరాజావారిని మించిన వేఱొకధీరుఁడు లేఁడని చెప్పవచ్చును. క్రూరమృగసంహారము కేవలము ప్రజాసంరక్షణార్థమై శ్రీవా రంగీకరించిరనుట కనేక నిదర్శనంబులు గలవు. కేవల మొకవినోదక్రీడగ దీనియందు లోలత గలవారు కారు. మృగయ సప్తవ్యసనములలో నొకటిగ నవగణింపఁబడినను స్వప్రజాక్షేమమున కిట్టిమహాకార్యము పవిత్రతమమని శ్రీవారికి దృఢవిశ్వాసముండుటచే నద్దానికై బయలుదేఱునప్పుడుగూడఁ గొన్ని ధర్మనియమములను బాటించుచుండెడివారు. వేఁటయం దెంతయుత్సాహ ముండినను, నొకప్పుడు రాత్రులయందు మూఁడుగంటలసమయమున బయలుదేఱవలసి వచ్చినను, నంతకుఁ బూర్వము లేచి కాల్యకృత్యములను దీర్చికొని, స్నాన మాచరించి, దేవతాపూజ చేసికొనిన

సీ. ఆలములోన వీరుఁడు జయంబును గాంచెడుకీర్తి మూఁడుశాస్త్రాలములన్ని మేషమునఁద్రుంచి యశంబునుగాంచి శౌర్యము న్మేలుగఁజూపి వీర్యమున మించితి వీ వతివీరమూర్తి వె వ్వేళల నీకు శ్రేయమగు విశ్రుతకీర్తికి ధర్మవర్తికిన్.

## దైవభక్తి

శ్రీరాజాబహద్దరువారికి 'నిత్యవ్రతనిష్ఠ,' 'నిర్వ్యాజవాగ్వృత్తి,' 'దీనోద్ధారసుబుద్ధి,' 'పరహితోద్దేశక సంసిద్ధి,' 'దానారంభసమృద్ధి' 'ప్రేమ' ప్రభృతిగుణంబు లెట్లు సహజభూషణంబు లయ్యెనో యట్లే భక్తిగుణముగూడఁ బ్రధానభూషణ మయ్యె. శ్రీవారు వేంకటేశ్వర భక్తులై నిత్యము తత్పూజాతత్పరత నానందించువారు. విద్వద్గణ్యమగు వంశమ్మున నవతరించి, బాల్యంబునన సకలవిద్యల నభ్యసించి, వైభవజిత పురందరులై, విజ్ఞానఖను లగుట శ్రీవారిజన్మాంతరసుకృతపరిపాకము. శ్రీవా రాగర్భశ్రీమంతులయ్యు నిగర్వచూడామణులు. బీదలయందు దయాదాక్షిణ్యబుద్ధి, మిత్రులయెడ నాదరబుద్ధి, భృత్యకోటియెడఁ బ్రేమబుద్ధి జన్మసిద్ధమగు దైవభక్తితో ననుబద్ధములై శ్రీవారిని 'రాజలోకచూడామణి' 'మానవలోకచింతామణి' యని ప్రసిద్ధపఱచె.

శీలసంపత్తి శ్రీరాజావారి రాజగృహమునఁ దాండవమాడుచుండును. దయాసత్యశౌచంబుల కాలవాలమగు నారీరత్నము నర్ధాంగలక్ష్మిగఁ బడసిన శ్రీరాజావారి నిశ్చలభక్తి

# 2. విద్యావికాసము.



శ్రేయఃప్రాపకమై, సకలసంశయచ్ఛేదకమై, యతీంద్రియవిజ్ఞానదాయకమై, పరమేశ్వర తేజస్సందర్శనసాధకమై, ధైర్యోత్సాహానందోత్తేజకమై మానవుని మానవత్వమునుండి తదున్నతస్థాన మగు దేవత్వపదవికిఁ జేర్చునదియే విద్య యనఁబడును. అట్టి విద్యాభివృద్ధికై శ్రీకృష్ణారాయ బహద్దరువారు సంతతము ప్రయత్నముచేయుచు నమూల్యములగు నవకాశములను సమకూర్చుచుండెడివారు. తాము కేవలము హూణభాషామహోదధి మథించి తత్సారామృతమును గ్రోలుటయేగాక యాంధ్రభాషాయోషను నవ్యకావ్యమణిమయాలంకారశోభితాంగిగ నొనర్ప విద్వత్కవిరాజశిఖామణులను బ్రోత్సహించుచుండెడివారు. శ్రీవారు శ్రీమ దాంధ్ర మహాభారత రామాయణాది బహుప్రబంధ నిరంతరపఠన కథాశ్రవణాసక్తులై యుండుచుండుటయే శ్రీవారి యాంధ్రవాణీప్రీతికిఁ బ్రబలనిదర్శనము. పేదలగు విద్యార్థులు దమ్ము నర్థింపవచ్చిన వారల నాదరించి తదున్నతికై నియమముగ ద్రవ్య మొసంగి రక్షించు శ్రీవారి విద్యాభిమానము వేనోళ్ళఁ గొనియాడఁదగినది. తమ్ము దర్శింపవచ్చినపండితుల సంభావించి యలవారి సాహిత్యకళావిశేషములకు నుప్పొంగుచు దేశమున నవ్యసాహిత్య వైభవంబునకుఁ జేయూఁత నొసంగుచుండెడివారు. మఱియు

లిన్యము చూపుమాయ దను పెద్దలవాక్యమును బాటించి సకలదివ్యక్షేత్రసందర్శన మొనరించి, యాయా పుణ్యప్రదేశములయందుఁ బ్రవహించు పావననదీప్రవాహంబులఁ గ్రుంకులిడి, సకలదానధర్మంబులు గావించి, పుణ్యాత్ముల దర్శించి తదాశీరభినందనము లందికొని పరమేశ్వరసందర్శనమహాభాగ్యంబునఁ గృతార్థులై జీవితమును సార్థక మొనరించుకొనిన శ్రీవారు సాధుజనగణాగ్రగణ్యులై సుకృతాత్ము లగుట భాగ్యాతిరేకనిదర్శనము. అదృష్టబలమున సంప్రాప్తమైన విద్యావిశేషము శ్రీవారికి నాధ్యాత్మికవిద్యా సంపదను, నిశ్చలపరమేశ్వరభక్తిప్రపత్తిని, నాత్మగౌరవ కళా కౌశలమును, నియమపూర్వక నిష్ఠాగరిష్ఠతను, బవిత్రతను సమకూర్చి ధన్యులఁ గావించెనని చెప్పుటలో నతిశయోక్తి యించుకంతయు లేదు. విద్యావికాసవిశిష్ట మగు శ్రీవారి జీవితము కడుంగడు శ్లాఘ్యము.



జనాపవాదాపయశోనివారణార్థమై దుర్భరగర్భభార ఖిన్నయు, నిరపరాధయుఁ, బరమసాధ్వీమతల్లియు నగు జానకీదేవిని గాఁడవుల డించివేయింప నిశ్చయించుకొనియు 'అద్యావసితం జీవితప్రయోజనం రామస్య, జీర్ణారణ్యాం జగ' త్తనుచుఁ, బొంగిపొరలు బాష్పపూరమును నిరోధింపనేరని శ్రీరాముఁ డెంతటికరుణామూర్తి కావచ్చును!

అన్నయాజ్ఞను శిరసావహించి విమలజాహ్నవీతట ప్రాంతకాంతారభూములందు వదినె నొంటి డిగ విడుచుచు

"జననీ! నీవు మహాపతివ్రతవు నీసౌశీల్య మిల్లాండ్రకె ల్లను మేల్బంతిరఘూద్వహాంఘ్రియుగళీలగ్నాత్మవై యుండుమా యని నేనెవ్వఁడ విన్నవింపఁ బతిఁ బాయంజేసి నిన్నొంటి డించినమూర్ఖాత్ముఁడ ... ... ... ... .. ... ... ..."

అని కనుగ్రింతల ముంతలఁబోసిన ట్లశ్రుధారలఁ గార్చుచు గోలుగోలున నేడ్చుచు, వీడిచనఁ దనకాళ్ళు రాక బిట్టుగొట్టుకొనుచుఁ గటకటంబడు సౌమిత్రి కరుణావివరణమున నన్నకుం దీసిపోవునా?

రామవియోగసంజనితదుఃఖసాగరనిమగ్నయై జానకి నిస్సహాయతఁ జేతులు పైకెత్తి 'హా రామా' యను నక్షర ద్వయమునే జపించుచు ముక్తకంఠముగ రోదనముసేయు చుండ 'నమ్మా! భయపడకుము. నన్ను మిథిలాధినాథుగ నీచిత్తంబులో నెంచుము. నాయాశ్రమాంతికభూములు నీ

అను నార్యోక్తికిఁ బ్రధానలక్ష్య మగుచున్నది. శ్రీవారు తమ మిత్రవర్గమునకేకాక సకలలోకమునకుఁ గూడ సన్మిత్రులు. ఎవ్వరికి నపకృతిఁజేసి యెఱుంగరు. శ్రీవారు ప్రజాక్షేమమే నిజక్షేమముగ నెంచి తన్మహాభాగ్య సంపత్తికి సన్మిత్రసంపాదనమే మూలసూత్రమని యెఱుంగుటయే కాక తదాచరణమందు విజయమొందిరి. ఒక్కొక్కతఱిఁ దన్నర్థింపవచ్చిన మిత్రవర్గమునకు మున్నభయప్రదాన మొసంగి సుధామయోక్తులఁ దదాప్తజనహృదయసంతాప మడంచి, యర్థిజనులపట్ల 'లేద'ను నక్షరద్వయమును లేదనిపించి నిర్వ్యాజవదాన్యతామూర్తి యని స్థిర యశంబును గాంచిన ధన్యుఁడు మా కృష్ణరాయ రాజశేఖరుఁ డొక్కఁడేయని లోకము గానముచేయుచున్నది. శ్రీవారు న్యూనతాధిక్యములను బాటింపక సమత వర్తించుచు

ఆ. "సుఖము విడిచియైన సురుచిరభోగంబు
విడిచియైన ధనము విడిచియైన
మేను విడిచియైన మిత్రునికార్యంబు
చక్కఁజేయు టదియ సఖ్యవిధము."

అను మహాకవి వాక్యమును వేదవాక్యముగఁ జేసిన ధన్యులు. "పరమగతి మిత్రుఁ డొక్కండె ధరణియందు" అను శ్రీరామవాక్యము నాదర్శముగఁ గొని తమ జీవితము గూడ ధర్మవీరులగు పురాతనరాజన్యచూడామణులజీవితము

# 4. ధైర్యము



"ఉత్సాహ స్సాహసం ధైర్యం బుద్ధిశ్శక్తిః పరాక్రమః
షడేతే యత్ర తిష్ఠంతి తత్ర దేవోఽపి తిష్ఠతి"

అమోఘమును భగవద్దత్తమును నగు నాత్మవిశ్వాసమే ధైర్య మనఁబడును. ఇది యుత్సాహప్రభుమంత్రశక్తులకు నిదానమైనది. ధైర్యవంతు లుత్సాహమును గోల్పోవఁజాలరు. ఉత్సాహమువలన మంత్రశక్తి జనించును. ఆలోచనాశక్తిచేతనే ప్రభుశక్తియుఁ, గార్యాచరణకుశలతయుఁ గలుగుచుండును. ధైర్యవంతునకే సదావిజయము. తనగమ్యస్థానము చేరువఱకును ధైర్యవంతుఁడు పనిచేయుచునే యుండును. సత్యనిష్ఠ, క్షమాసంపత్తి, పవిత్రత ధైర్యవంతుని సహజగుణములు. ఈయనంతవిశ్వారామమున విహరించునప్పుడు నడుమ వచ్చెడు నపారవిపత్పరంపరాఘాతములకు జంకక తను వర్పించుచుఁ బ్రాక్కృతకర్మజంఝూవాతసముద్ధూతసంకల్పవికల్పదురంతమహావృక్షములు పైఁబడినను గాలూఁది నిలిచి తననిస్సహాయత కొక్కొక్కతఱి ఘోరవిషాదసాగరగర్భమునఁ బడి మ్రుక్కి వేసారి కన్నుల నీరు గ్రమ్మ నాకసమువంకఁ జూచుచు హా, యని వేడినిట్టూర్పు గాడ్పులహృదయవేదనాబడబానలము ప్రజ్వలింపఁజేయుచుఁ జేయునది లేక తనసర్వస్వమును భగవంతున కర్పించి

“తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం” మను భగవద్దత్తాభయప్రదానమును సంస్మరించుచు దిగులు విడిచి తెలివొంది కార్యరంగమున కుఱుకువాఁడు ధైర్యవంతుఁడుగాక మఱెవ్వఁడు? కావుననే

‘అనిర్వేదః పరం దైవ మనిర్వేదః పరం బలమ్’

అని పరమార్థప్రతిపాదక మైనతన రామాయణ మహాకావ్యమందు భగవంతుఁ డగువాల్మీకి వేమాఱు సందేశ మొసంగియున్నవాఁడు.

శ్లో. ‘నిన్దన్తు నీతినిపుణా యదివా స్తువన్తు
లక్ష్మీ స్సమావిశతు గచ్ఛతువా యథేష్టమ్;
అద్యైవవా మరణ మస్తు యుగాన్తరే వా
న్యాయ్యా త్పథః ప్రవిచలన్తి పదం న ధీరాః.’

అని ధైర్యనిధి యగుభర్తృహరి వచించినట్లు ధైర్యసంపన్నుఁడెట్టి సంకటసమయమునను దనస్థానమునుండి యించుకంతయైనను జలింపఁడు. వాఁడు కేవలభౌతికసౌఖ్యసామ్రాజ్యమునకు లోనుగాక పరమేశ్వర తేజస్సందర్శనమే లక్ష్యముగఁ గొని ముందునకు సాగిపోవుచుండును. నడుమ నైహికసౌఖ్యలోలు రగు రాజనీతివిశారదులు నిందింతురుగాక, లేదా పొగడుదురుగాక యవ్వారిదూషణభూషణములకుఁ బులకితాంగుఁడుగాక సత్యనిష్ఠయంద సుప్రతిష్ఠితుఁడై యుండు. సంపదలు వచ్చి తన్ను వరించిన వరించుఁ గాక;

లేదా, సౌఖ్యనిధాన మగు తనయావత్సంపదయుఁ దొలఁగి పోయినఁ బోవుఁగాక; యతఁడు తనక్షమాసంపదనే చిక్కఁ బట్టుకొనియుండును. ఒక్కొక్కవేళ నప్పుడ ప్రాణము లర్పింపవలసివచ్చినను లేక యుగయుగాంతరములవఱకు నిలువఁగలభాగ్య మబ్బినను దన విమలపవిత్రదృక్పథమునుండి తొలంగఁజాలఁడు. వేయేల! ధైర్యవంతునకే సర్వత్ర విజయము. ధైర్యవంతుఁడే లోకకల్యాణమునకుఁ దోరణము గట్ట సమర్థుఁడు. ధైర్యవంతుఁడే దీనుల నుద్ధరించి యీయనంతవిశ్వవికసనహేతుభూత మగు పవిత్రసందేశ మొసంగఁగల భాగ్యవంతుఁడు. అతఁడే చిరస్థాయి. దేవేంద్రుఁడు రాలవానఁ గురిపించి గోగోపీగోపనివహంబునకు భీతి జనింపఁజేయఁ గరుణాసముద్రుఁ డగు శ్రీకృష్ణభగవానుఁడు తన కొనవ్రేల గోవర్ధనగిరి నెత్తి తదాశ్రితబృందమునకు

శా. "బాలుం డీతఁడు కొండ దొడ్డది మహా
భారంబు సైరింపఁగాఁ
జాలం డోయని దీనికిం్రద నిలువన్
శంకింపఁగాఁ బోల దీ
శైలాంభోనిధిజంతుసంయుతధరా
చక్రంబు పైఁబడ్డ నా
కే లల్లాడదు బంధులార! నిలుఁడీ
క్రిందం బ్రమోదంబునన్."

అని యొసంగిన యభయప్రదానమును దలంచిన నెవ్వాని మేను జలదరింపదు ?

శ్రీకృష్ణ కథామృతమును దనివిదీరఁ గ్రోలి తదుదార చారిత్రమునే సంతత మాదర్శముగ నుంచుకొని ప్రవర్తించు దీనజనకల్పకమగు మన శ్రీరాజా వేంకటకృష్ణారావు బహద్దరువారి పరమపావనజీవితము ధైర్యగుణభూషణభూషితము. శ్రీవారి ధైర్యము విమలచారిత్రమునకు నూతనవికాసమును ఘటించుచు సజ్జనగణ్యమై, యమోఘమై, యానందజనకమై యలరారుచున్నది. శ్రీవారి మిత్రసంతతి కప్పుడప్పుడు సంఘటించిన విపత్కష్టములు శ్రీవారి ధైర్యసందేశమువలననే దాఁటుటకు సుగమములైనవి. అశ్వారోహణమందున నేమి, గజారోహణమందున నేమి, తదితరయంత్రశకటారోహణమందున నేమి, పెకేల, విమానయానములయందున నేమి- అతినైపుణ్యమును, నతిసాహసమును, నతివేగమును, గలవారై నుతిఁగన్నవారు. అందులకు ముఖ్యహేతువు శ్రీవారి ధైర్యసంపదగాక మఱేమి కలదు? విద్వత్కవిలోకము శ్రీవారినిఁ గాంచినంతట "సముద్ర ఇవ గాంభీర్యే ధైర్యేణ హిమవానివ" యని గానముచేయును. శ్రీవారి ధైర్యసాహసములే క్రూరకర్వ్యాదోపద్రవభీత చిత్తులగు దీనులకుఁ బెట్టనికోటయై ధైర్యలక్ష్మిం జేకూర్చి సుఖజీవన మొసఁగుచున్నవి. అనంతము లగు ప్రకృతిపరీక్షల జయమొంది లోకస్తుతిపాత్రమై, పరమపవిత్రమై, కవిజనాహ్లాదకరమై,

యానందజనకమై, జగద్విఖ్యాతహేతువై, పరిబంధసన్ని భమై సుస్థిరమైన శ్రీవారి ధైర్యలక్ష్మీదివ్యసౌధము మిన్నంటి యాచంద్రతారార్క మలరారుఁగాత!

"సకలసంపత్ప్రధాన కారణము ధైర్యము. అంతకు మిన్న మఱియొకటి లే" దనిలోకమునకు సందేశ మొసంగిన శ్రీవారి ధైర్యగుణభూషిత మగుచారిత్రము కావ్యరూపమై లోకమున కాదర్శ మగుచున్నది. కావునఁ బ్రతి మానవునకును సుఖకర మగు జీవయాత్ర నడపుకొనుటకు ధైర్యమే మూలకారణము.



# 5. సత్యదీక్ష



శ్లో. "ప్రారభ్యతే న ఖలు విఘ్నభయేన నీచైః
ప్రారభ్య విఘ్నవిహతా విరమన్తి మధ్యాః
విఘ్నై ర్ముహుర్ముహు రపి ప్రతిహన్యమానాః
ప్రారబ్ధ ముత్తమగుణా న పరిత్యజన్తి.

శా. ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాసనంత్రస్తులై;
యారంభించి పరిత్యజింతు రురువిఘ్నాయత్తులై మధ్యముల్;
ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరుసుమీ ప్రజ్ఞానిధు ల్గావునన్."

సుభాషితప్రసిద్ధబోద్ధ భర్తృహరి గావించినపైయుద్బోధము ననుసరించియు, నార్యజనహితధర్మప్రబోధము ననుసరించియు శ్రీరాజావారి కార్యదీక్ష మిక్కిలి సునిశితమైనది. చేపట్టిన కార్యము విడుచుట ధీరజనలక్షణము కాదనియుఁ దలపెట్టిన కృత్యము నెట్టిక్లిష్టసమయములందైన నోర్చి వెనుకంజవేయక సాధించుట మహాపురుషుల లక్షణ మనియు గ్రహించికాఁబోలు శ్రీరాజావారేకార్యముఁ జేయఁబూనినను దుదివఱకు మహాదీక్షతోఁ బనిచేసి దానిని సాధించుచుండెడివారు. దీనినిబట్టి శ్రీవారి ధైర్యసాహసమనోబలమెట్టిదో, ధర్మాసక్తి యెట్టిదో, కార్యశూరత యెట్టిదో, ధీరశీలసంపన్నత యెట్టిదో చెప్పకయ సుస్పష్టమగుచున్నది. "న నిశ్చితార్థా ద్విరమన్తి ధీరా" అనుసూత్రమునకు

శ్రీవారి జీవితచారిత్రము మేలిత్యాగాణమనుట కిసుమంతయు సంశయము లేదు. శ్రీవా రేకార్యము చేయఁబూనుకొన్నను ముందుగ ననేకవిధముల స్వాఽఽశంకాసమాధానములతో నాలోచించినపిదపఁగాని చేయనిశ్చయించుకొనువారు కారు. కార్యసాధనము కాదని హృదయసంకోచము కలిగిననాఁడు గాని, యట్టికార్యమువలనఁ దమకుఁగాని, లోకమునకుఁ గాని యెట్టిప్రయోజనము లేదని తెలిసినప్పుడుగాని యట్టి కార్యమునుండి బుద్ధిని వెంటనే మరల్చువిలక్షణస్వభావము గలవారు. ధర్మమని నమ్మి యొక సత్కార్యము నొక పర్యాయము చేయసంకల్పించినచో దానిని బ్రాణమునకుఁ బ్రాణ మొడ్డియైనను బరాక్రమవిక్రమంబున సాధించి సిద్ధ సంకల్పు లగుదురు. అంతియకాని నడుమ నడుమ సంభ వించు విఘ్నములకుఁగాని, కష్టనష్టములకుఁగాని, వ్యయ ప్రయాసములకుఁగాని కాసంతైనను జంకుస్వభావము కల వారు కారు. అధర్మకార్యములకుఁ గలనైనఁ గడంగక, నిరంతరధర్మకార్యనిర్వహణసందర్భముననే యుద్యమించు శ్రీవారిదీక్షయే సత్యదీక్షగాని తదితరములు మృషాదీక్ష లనిన నాక్షేపము గలదా? లోకమున సర్వసాధారణము గా మానవుల కెల్లరకును దీక్షాపేక్ష యనుగుణ మొకటి యుండును. దానిచేఁ దాము తలపెట్టినకార్యములు సాధించు కొనుచుందురు. కాని వారిదీక్ష ధర్మైకాశ్రితముగాక దంభాసూయాక్రోధదూషిత మగుటచే నది యొకవిధమగు పట్టుదల యనిపించుకొనునేగాని దీక్షగాఁజాలదు. అట్టి పట్టు

దల వహించుట సజ్జనలక్షణము కాదు. ధీరోదాత్తగుణమును గాదు. శ్రీవారిపట్టుదల యిట్టితరగతిలోఁ జేరినదికాదుకనుక నీచమానవులవలె రాఁబోవువిఘ్నములకు భయపడి మానుకొనుటగాని, మధ్యములవలెఁ బ్రారంభించి కష్టముల నెదుర్కొనలేక జంకి మానుకొనుటగాని లేక యారంభించిన కార్యము చివరదాఁక నిగ్రహింపఁబడుచునే యుండెడిది. వీరి సత్యదీక్షయు, మానసోత్సాహమును, నాత్మధైర్యమును, వీరికి సర్వకార్యములయందు దిగ్విజయము చేకూర్చుచుండెడివి.

ధైర్యసంపన్నుల కెప్పుడును సంతాప మనుమాట యుండదు. మానవులకు ధైర్యమే భూషణము. ఈ ధైర్యలక్ష్మి శ్రీరాజాగారిని జిన్నతనముననే వరించియుండె. శ్రీవారి జీవితసౌధము ధైర్యమూలబంధముపైఁ గట్టఁబడియె. వీరికి నుగ్గుపాలనాఁటనుండియు ధైర్యమనుగుణము పట్టుపడి యుండె. అదియే శ్రీవారికి లోకఖ్యాతి నార్జించినది. అదియే శ్రీవారి యశోవల్లికను దిగంతములకుఁ బ్రాకఁజేసినది. అదియే ఖండాంతరములయందుఁగూడ శ్రీవారి కొక యున్నతస్థానమును గల్పించినది. మానవుల కుండవలసినగుణములలో నిదియే ప్రధానము. ధైర్యగుణము కొఱవడి తక్కుంగలగుణము లెన్ని యున్నను బ్రయోజనము సున్న. ధైర్యగుణ మున్ననాఁడు తక్కినసద్గుణము లన్నియు వాని వశమునందే యుండును. చివర కదృష్టదేవతకూడ ధీరోదారగుణరత్నాకరునే వరించును.






శ్రీ రాజా వేంకటకృష్ణారావు బహద్దరువారి విమానయానము

# 6. విమానయానము



విమానమును నడపుటయన నసామాన్యవిషయము. దాని నలవరచుకొనుటకుమున్ను ధైర్యసాహసములును బుద్ధికుశలతయును, బట్టుదలయును గలవాఁడై తత్కళావిశేషము నందుఁ బరిచయమును సంపాదించుకొనవలయును. ఎట్టికళలైనఁ బుణ్యులకుఁ బూర్వజన్మార్జితసుకృతవిశేషమునఁ దమంత లభించుచుండును. శ్రీకృష్ణరావుప్రభువర్యులు సర్వకళలయందునుఁ బ్రబలప్రౌఢిమ సంపాదించినవారు. అందు విమానమును నడపుటలో నద్వితీయులని ప్రఖ్యాతిఁ గాంచినవారు. పాశ్చాత్యదేశములందు నీకాలమున విమానములు నాఁడునాఁటికి వృద్ధిపొందుటంజేసి తద్గమనాగమనకౌశలమున నారితేఱిన మహాయోధులు పెక్కుమంది కలరు. వారిలో నాంధ్రదేశమునఁ గృష్ణరావుబహద్దరువారు ప్రథమగణ్యులు. ఆంధ్రదేశమే యననేల యాసేతుహిమాచలము దేశీయరాజేంద్రులలో నేతత్కళాప్రవీణతం బ్రశస్తిగనిన మహావీరులు శ్రీవారుమాత్రమే యని నిస్సంశయముగను ఘంటాపథముగను జాటించవచ్చును. శ్రీవారు తత్పరీక్షలలో ఏ. పైలెట్టునందుఁ గృతార్థులైనారు. స్వీయవిమానయాత్రచేఁ దమసన్మిత్రులకుఁ, జూపఱకు నానందము గూర్చుచుండెడివారు. తమవిమానయాత్రావిశేషములచే ఖండఖండాంతరవాసులను కేవలకళానైపుణ్యమున నేకాక

వాచానైపుణ్యమునఁగూడ నేతత్కాళ స్వీయకళ యని గర్వించుచుండిన యనేకాంగ్లేయసోదరులను బరిచితులుగాను స్నేహితులుగాను గావించుకొనిన ప్రథమాంధ్రివీరులు. ఇందుల కలహాబాధనకు వచ్చిన విమానయాత్రాచరణ రసికులను జూడఁ జనుదెంచుటయే, యందు వారిపరమాసక్తిని జెప్పకచెప్పుచున్నది. తమ విమానవిజయయాత్రాకాలములయందుఁ దమపురోభివృద్ధిఁ గోరినపెద్ద లగుస్నేహితులు "సాహసము వలదు; నీకు విజయ మగుఁగాక" యని మంగళాచరణముగ వచించువాక్యమునందుఁ గల 'సాహసము వల' దను భీతభీరోక్తి విననొల్లక చిడిముడిపడుచు ధీరతాద్యోతకముగ వ్రేలు పైకెఁ జూపుచు "***Fear none but God***" అని మిత్రులకెల్ల వీరసందేశ మొసంగి యత్యుత్సాహమున యాత్రికకుతోభయులై వెడలుచుండెడివారు. అట్లు వెడలుటయేకాక తత్తత్క్రీడారంగములందు సర్వదా విజయలక్ష్మీవిభాసితు లగుచుండిరి. దాననే చెన్నపురియందు స్థాపింపఁబడిన వైమానికమండలి "Flying Club" కి (Vice-Chairman) ఉపాధ్యక్షపదవి నలంకరించు నుత్తమార్హతఁ గాంచిరి. శ్రీవారు విమానవిహారమహాసాహసికులును, బహుచాతురీకలితులు ననుటకాకాశమున 12,000 అడుగుల (సుమారు 7 మైళ్లు) యెత్తునకుఁ బోవుటయు, నక్కడ నానావిధకళానైపుణ్యమును జూపుటయు, గంటకు 90 మైళ్ళ వేగమునఁ బరపించుటయుఁ బ్రబలనిదర్శనంబులు.

ఔరా ! పురుషు లెంత ధీరులైననేమి, యెంతభోగులై ననేమి, యెంతత్యాగులైననేమి, యెంత సత్యనిష్ఠాగరిష్ఠులైన నేమి, యెంత దీనజనసంత్రాణబద్ధకంకణులైన నేమి, యెంత దయాసముద్రులైన నేమి దుర్విధిని ధిక్కరింప నసమర్థులే కదా !

25-8-1935 న శ్రీకృష్ణారాయబహద్దరువారు స్వీయ సంఘకార్యనిర్వహణార్థమై సుదూరదేశము పోదలంచి యథాచారము తనయుచితకృత్యముల నెల్లఁ దీర్చికొని, యిష్టదైవమునకుఁ బ్రణమిల్లి, ప్రతివాతవర్షపాతదుర్నిమిత్తములకు శంకించుబంధుమిత్రుల సెలవుగైకొని తమయుత్తమ విమానముపై మఱి యిద్దరు స్నేహితులతో బయలువెడలిరి. కార్యశూరులు కాలయోగములకు జంకుగొనరుగదా ! శ్రీవా రెట్టివిషఘటికయం దిలు వెడలిరోగాని కొలందిమైళ్ళు పోవునంత వాతాడంబరము ప్రభూత మయ్యెను. ఎడనెడ జడివాన విడివడి వర్షించెను. విమానవేగము నిరుద్ధమై యది వెనుకకుఁ బ్రక్కలకు నెట్టివేయఁబడఁ దొడఁగెను. కొన్నియెడల నది తలక్రిందుగఁ దిరిగి పోవుచుండెను. అయినను బ్రచోదకులగు శ్రీవారు దమ నేర్పుకొలంది విమానమును సన్మార్గమునఁ బఱపుచు నెల్లూరుపట్టణప్రాంతమునఁ బొన్నలూరు గడచిపోవుచుండిరి. నిమిషనిమిషము ఫెళఫెళమని యుఱుమునుఱుములు చెవులు గడియలువడఁజేయఁదొడఁగెను. థళక్కుథళక్కుమని మెఱుపుమెఱపులు కనుల మ్రూఁతలువడఁజేయఁ దొడఁగెను.

దడదడ ఱాలు రువ్వినవడువున విడఁబడి జడివాన జోరున వర్షించుచు దిక్కు దెలియనీయదయ్యె. దశదిశావిస్తృతమై మహాపాదపోత్పాటనపాటవమైన ప్రళయఝంఝావాతహతకుఁ డన్నిటిని దలదన్ని విమానముతో వైమానికుం గూడఁ గిట్టి, యొక్కపెట్టఁ జుట్టుముట్టి తనకట్టిఁడితనముం జూపసమకట్టె. పలుగురు దుండగు లేకమై యొకయెడ ముట్టడించిన నెట్టిదిట్టఁడైనఁ బట్టువడకుండు టెట్లు? ధైర్యమువీడక 'నిగ్రహించు టెట్లా' యని శ్రీకృష్ణారావుబహదరుగారు సమాలోచించుక్షణముననె తటాలున విమానసవ్యపక్షము విక్షిప్తమై బహుదూరమున నెందో భూమిపైఁ బడిపోయెను. తదుత్తరక్షణముననె దక్షిణపక్షముగూడ నక్షివిషయము గాకపోయెను. 'ఔరా! యనర్థపరంపరాప్రకార' మనుకొనుచుండఁగనే యొక్కతోపున రంయ్యని విమానము ఱెక్కలుతెగినపక్కివలె నిలువుగా నింగినుండి నేలంబడి తనయొడయనితో లోఁతునఁ బాతికొనిపోయె.

కట్టా! విధివిపాకము! వేంకటకృష్ణారావుబహద్దరుగారి మాయాభౌతికదేహ మిట్లు మంటిపాలయినది. ఖేచరుల కనులమంట చల్లారినది. వెక్కసపడు జక్కులరాయఁడు బ్రతుకుజీవుఁడా చిక్కుతీరిన దని తనతుక్కుయానమును జక్క చేయించెను.

తీఱనికడుపుకోఁత యేర్పడుట నాంధ్రమాత బిట్టువాపోవుచున్నది. వైమానికనాయకులు తమతలమానికము మాయమయ్యె నని కూయిడుచున్నారు. బంధుమిత్రభృత్యుల

వంత కంతు గానరాదు. అనుఁగుంగూఁతు నిచ్చి యద్దు ముద్దులు సూచుకొనుచు దౌహిత్రసంపదం గని యానం దించి, యెన్నఁడు నెట్టివిచారలేశము, నేక్లేశమునను గొనక ముందుగ శ్రీ శ్రీ శ్రీ రాజా సురభి లక్ష్మారాయబహద్దరు గారు స్వర్గ మలంకరింపఁగల్గుట ధన్యులైరి గాని నిరం తరధర్మవ్రతశతాచరణక్లేశకృశీభూతలును, జరాజర్జరితాం గులు నగు శ్రీశ్రీ మహారాజ్ఞి వేంకటరత్నమాంబగారాణిని దుఃఖముపాలుగాక తప్పినదిగాదు. కడుపారఁగని, పెంచి, పెద్దనొనర్చి, నిజవంశవివర్ధనుఁ డనియు, నిజప్రతిష్ఠాకారక జ్యేష్ఠుఁ డనియుఁ, గన్నుంగాలనియుఁ బేరాసపడు మూఁడు గాళ్ళముద్దులు తలిదండ్రులు జీవచ్ఛవంబు లైరి. అభము శుభము నెఱుఁగని నిసుంగుల యనభివ్యక్తావస్థం గనిన గుండె నీరుగాక నిలువఁగలధీరుఁ డుండునా! ఇఁక నర్ధాంగీత్వ మునఁ దన్మయ యగు నిల్లాలివికటాభిఘాతముచే సర్వ స్వాపహృతయగుట నెట్టిదురవస్థం జిక్కియుండునో యభిజ్ఞు లూహింపఁదగునేగాని వ్రాయఁజేయాడకున్నది. 'పుత్రి వతి యగు శుద్ధాంతకాంత యింతసాహసింపరా' దను స్త్రీ యాప్తహితోక్తిపాశములే తన్ను బంధింపకుండినఁ దా నింట లేక నాథుఁ డొంటి నుండఁగా దయ్యపుఁదుంటరుల జంటగొని కృతాంతహతకుఁ డొనర్చినయీదురంతమునకు శ్రీ సరస్వతీ మహాసతి వారిని వెన్నంటి తగినశాస్తి గావించి, తప్పక తననాథుని వెంటఁగొని వచ్చియుండెడిదియె. మూలల నంటి యెచటెతుంటరు లచటన కంటఁబడక కాలికి బుద్ధిసెప్పిరి కాని

లేకున్న వీరకిశోరము మామురళీకృష్ణుఁ డొక్కఁడ బారువెట్టి వారి నందఱ నొక్కవ్రేటునఁ గాల్చివైచి యుండువాఁడు.

ధర్మకల్పవల్లు లగు శ్రీశ్రీశ్రీ జటప్రోలు మహారాజ్ఞీమతల్లులు నిజజామాతృమహృదయులగు శ్రీకృష్ణారావు రాజాబహద్దరువారిపేర నొక యుద్యానవనమును నిర్మించి తమతోపాటు శ్రీకృష్ణారాయప్రభుచంద్రుల వియోగదుఃఖమునఁ గృశించు కొల్లాపురీప్రజలకుఁ గొంత ప్రశాంతి గల్పించిరి. అంతియగాక "జఫర్ మైదానమందు" శ్రీరాజావారి శిలాప్రతిమా స్థాపనముం గావించుటకుఁగూడ సంకల్పించిరి.

సన్మిత్రులగు 'వైమానికమండలి' వారు శ్రీవారి గౌరవార్థమై "**Raja I. V. Kristna Rao Silver Cup**" అను నొకదానిని స్థాపించిరి. అద్దానిని శ్రీవారిబంధుసముద్రులును, భావుకులును, సకలవిద్యాభిమానులును, ద్యాగమూర్తులును, గుణాభిరాములును, సుకవితాప్రియులును నగు శ్రీశ్రీశ్రీ పీఠికాపుర యువరాజాబహద్దరుగారు ప్రేమపూర్వకముగ నర్పించిరని యీక్రింది ప్రకటనమువలనఁ దెలిసెడి.

"FROM HINDU" Madras, July **17.**

## Raja Kristna Rao Trophy.

Arrangements are being made by the Madras Flying Club for running a competition for the award of the 'Raja I. V. Kristna Rao Silver Cup'. The cup it may be mentioned, was endowed by the Yuvaraja of Pithapur, in memory of the late Raja I. V. Kristnarao, a keen aviator and sometime Vice-Pre–

sident of the Club. The Raja it will be recalled died under tragic circumstances with two other members of the Club in a plane crash last August at Ponnalore near Nellore. The Cup it is learnt will be a rolling cup, awarded each year to the winner of the competition to be held by the Club. The competition will be open only to members of the Club and will include a short cross country fight.

ఔరా ! కాల మలంఘ్యము. విధికృత్యములు దురవగాహములు. మహాత్ముల జీవితము లాకల్పాంతస్థిరములు. కర్మగతులు గహనములు. సంకల్పవికల్పములును, సుఖదుఃఖములును, యోగవియోగములును, బరమేశ్వరాధీనములు. పరమేశ్వరుని సంకల్ప మమోఘము. ఇందుకు శ్రీకృష్ణారాయ బహద్దరువారి నామమునఁ బ్రసిద్ధిఁగన్న 'కృష్ణ' యను నక్షరద్వయము శ్రీవారి సకలబంధుహితవర్గములకు నొక మంత్రమట్టుల నిరంతరజప్యమై విఖ్యాతమగు నట్లొనర్చుట కంటె వేఱు నిదర్శన మేల ?

పరమేశ్వరుఁడు శ్రీవారి యాత్మకు సంపూర్ణశాంతి నొసంగుఁగాక ! శ్రీవారి జీవితచారిత్రము నొక మహాప్రబంధనిర్విశేషముగ నాచంద్రతారార్కము నిబంధించుఁగాక! శ్రీవారి సద్వంశకల్పతరు వాకల్పము శాఖోపశాఖావిస్తృతమై నానాకవిసంతానాశ్రయమై యలరారున ట్లనుగ్రహించుఁగాక! శ్రీవారి చిరంజీవుల కాయురారోగ్యైశ్వర్యాభివృద్ధి సమృద్ధిగ ననుగ్రహించుఁగాక !



# 7. సతీవిలాపము



భర్తృవియోగదుఃఖ మిల్లాండ్రకుఁ బరమదుస్సహము. పెరదుఃఖము లెట్టివి వేనవేలు పైఁబడినను నెట్టివేయఁగలుగుదురుగాని యీదుఃఖమునకు మాత్రము కట్టువడకపోరు. పాణిగ్రహణసుముహూర్తము మొదలుకొని తనువులు వేఱుగఁదోఁచుచున్నను నాత్మ యొకటిగ మెలఁగుచుఁ, బరిణతప్రేమసారమై యన్యోన్యాశ్రయమునఁ గన్నులపండువుగ నలరు మిధునమునకు వియోగ మేర్పడిన నంతకంటె నసహ్యము వేఱుండఁబోదు. అందును బురుషవియోగమున లతాంగి, మాధవవిచ్ఛేదమున మాలతివలె నేలఁబట్టకపోదు. అన్యత్ర స్త్రీ లెంతధీరలయ్యు నీవిషయమునఁ గేవలమబలలే.

శ్రీ శ్రీ సరస్వతీదేవీమతల్లిమాత్రము ప్రకృతిబద్ధగాక యెట్లుండును? ఆయమ్మ పడునవస్థ వర్ణనాతీతము. పాడినుడులతోఁ బొక్కిపొక్కి, చిక్కిచిక్కి, తుదకు, గ్రుక్క దిప్పికొని, విజ్ఞానవతియుఁ గవయిత్రియు నగుటఁ దన విలాపమును 'నిత్యప్రార్థనా'గ్రంథరూపమున ఛందోబద్ధము గావించి ధన్యమైనది. నిస్సారవాక్యాంతరములఁ దద్భావముల వివరించుటకంటె యథామూల మది సాంతముగ నిందుఁ బ్రకటించుట యుక్తతరము; కాని గ్రంథవిస్తరభీతిని గొంతయే ప్రకటితము. సమగ్రముగఁ బఠించి, యిది ప్రత్యేక

కావ్యముగ నుండఁదగునని డాక్టరు, ఆంధ్రసాహిత్యచక్రవర్తి, బ్ర. శ్రీ. చిలకమర్తి లక్ష్మీనరసింహముగా రనుగ్రహించిన పీఠిక సర్వభావసంగ్రహద్యోతక మగుట నిందుఁ బ్రకటింపఁబడియెడి.

* * *

"పూర్వకాలమున భరతఖండమున సంస్కృతభాషలోనేగాక దేశభాషలయందుఁగూడఁ బెక్కండ్రు కవయిత్రీమణులు కలరనుమాట నిర్వివాదాంశము. గీర్వాణభాషలో రాజశేఖర మహాకవిపత్ని యైన యవంతిసుందరి గొప్ప విద్వాంసురా లనియు నలంకారశాస్త్రమున నవంతిసుందరీమతమని ప్రత్యేకముగా నొకమతము కలదనియుఁ, బండితులు వ్రాసియున్నారు. ఈమెగాక లీలావతి మొదలగు కాంతారత్నములుగూడ దేవభాషలోఁ గవిత్వముఁ జెప్పి ప్రఖ్యాతి గాంచినట్లు మనము వినుచున్నాము. దేశభాషలలోఁగూడ నట్లే మధురకవిత్వములు చెప్పి రసికజనమానసముల రంజింపఁజేసినకవయిత్రీమణులు కొందఱు గలరు. అరవబాసలోఁ గవనము చెప్పిన యవ్వయార్ వారిలో మొట్టమొదటిది. దేశభాషలందు లెస్స యైన తెనుఁగునందు మొల్లయు, ముద్దుపళనియుఁ, దరిగొండ వేంకమ్మయు నవరసములు చిప్పిలునట్లు కావ్యములు రచించి, విద్వజ్జనమాననీయ లైరి. సామాన్యస్త్రీలేగాక యసూర్యంపశ్య లైన యంతఃపుర కాంతలుకూడ విదుషీమణులై కవనముచెప్పి రని మనము వినుచున్నాము. కృష్ణదేవరాయల భార్యలలోఁ

నొకర్తె రచియించినవని పండితులు కొన్నిశ్లోకములు చదువుదురు. ఆరాయలకుమారికలలో నొక్కరిత మహాప్రబంధము నొకదానిని విరచించినట్లు చెప్పి విద్వాంసులు దానిలోనివని కొన్ని పద్యములు చదువుచున్నారు. స్త్రీగాన మెంతమనోహరముగా నుండునో పాండిత్యము సంపాదించి కావ్యము రచియించిన స్త్రీకవనముకూడ నంత మనోహరముగా నుండునని నాయభిప్రాయము.

కరుణరసపూరితమైనయీచిన్నికావ్యమును, రచియించినవిదుషీమణి జటప్రోలు సంస్థానాధిపులును, దానరాధేయులును, శూరశిఖామణులును, విద్యావినోదులును, బండితపక్షపాతులునై కీర్తికాయముతో మృతజీవులైయున్న శ్రీసురభి లక్ష్మారావు బహదర్ వారి పుత్రికారత్నములలో ద్వితీయరత్నము. శ్రీరాజా యినుగంటి వేంకటరమణరావు బహదర్ వారి కుమారరత్నమై, సుగుణరత్నాకరులై, పండితపక్షపాతులై, శూరాగ్రేసరులై, బహుకళాకోవిదులై యాంధ్రదేశముయొక్క భాగ్యదోషమునఁ గీర్తిశేషులైన శ్రీరాజా యినుగంటి వేంకటకృష్ణారావు బహదర్ వారి ధర్మపత్ని. ఈమెనామధేయము శ్రీసరస్వతీదేవి. విద్యావతియై సరసకవిత్వము చెప్పనేర్చుటచే సరస్వతీనామధేయమీమెయందు సార్థకమైనది.

భర్తగారైన వేంకటకృష్ణారావు బహదర్ వారు బహుకళాకోవిదులగుటచే విమానములు నడపుకళగూడ నేర్చికొని యొకవిమానమును సంపాదించి దానిపై

నెక్కి తామే దానిని నడపుకొనుచు, విమానారూఢుఁడై విశ్వమెల్ల సంచరించినయుపరిచరవసుమహారాజువలె స్వేచ్ఛావిహారము సలుపుచు దైవవశమున 1935 సం॥ ఆగస్టు నెలలో నెల్లూరుసమీపమున విమానము భగ్నమగుటచేఁ బరమపదము నొందిరి. భర్తృవియోగదుఃఖమును వెలిపుచ్చుటకే యీకావ్య మాసాధ్వీమతల్లిచే రచియింపఁబడినది. ఈపతివ్రతాశిరోమణి యీకావ్యమున వెలయించినభావములు, కరుణరసమును వెలిపుచ్చుచున్నవి. ఈ గ్రంథము చదివినప్పుడు, కాళిదాసవిరచిత మైనకుమారసంభవములోని రతివిలాపము జ్ఞప్తికి వచ్చుచున్నది. జాలిగొలుపుచున్న యీపద్యములు వినినవారి హృదయములు కరఁగిపోక మానవు. కన్నీరు జొటజొటఁ గారక మానదు. మనసు విచారమగ్నము కాకపోదు. శ్రీసరస్వతీదేవిగారి కిది ప్రథమప్రయత్నమైనను గవనము రసవంతమై సర్వజనహృదయంగమమై యుండుట మిక్కిలి శ్లాఘాపాత్రము. పతియే దైవమని నమ్మినపడంతికి భర్తృగుణవర్ణనముచేసి యామహనీయునిచరణారవిందములు హృదయమున నిలుపుకొని తచ్చరిత్రము పద్యరూపమున గానముచేయుచుఁ, గాలక్షేపము చేయుటకంటె నపేక్షణీయ మేమున్నది? భర్తృగుణకీర్తనముచేత నీసాధ్వీశిరోమణి నేర్చినకవిత్వమును ధన్యము చేసికొన్నది, జన్మము చరితార్థము చేసికొన్నది, తోడిపడంతులకు మార్గదర్శిని యైనది. కవిత్వము రసవంతమై ప్రశంసనీయమై యున్నదనుమాట యతిశయోక్తి గాదు. సర్వవిధ

ముల నీగ్రంథ మాంధ్రమహాజనులకు నందు ముఖ్యముగ నారీమణులకు నాదరణీయమై పఠనీయమై యున్నది.

శ్రీజటప్రోలు మహారాజ్ఞిగారి పుత్రరత్నమునకును, మనుమలకును గురుమహాశయుఁడును, శ్రీసరస్వతీదేవిగారి కవితాగురువును, నాకు శిష్యుఁడును, మిత్రుఁడును, బరమాప్తుఁడును, సుకవియు, స్నేహలతాకవితాసంఘస్థాపకుఁడును నైన చిరంజీవి వాజపేయయాజుల రామసుబ్బారాయఁ డీగ్రంథమునకుఁ బీఠిక వ్రాయవలసినదని నాకడకుఁ దీసికొనివచ్చి పద్యములెల్ల వినిపించెను. ఆపద్యములు వినినతోడనే నామనసుకూడ దుఃఖపూరితమైనది. కాని కావ్యదృష్టిం బురస్కరించుకొని రసవంతమగు నిట్టి గ్రంథమునకుఁ బీఠికమైన వ్రాయుట యపేక్షణీయమ మై యుండును గాన నే నిందుల కియ్యకొంటిని.

స్త్రీలు కవిత్వము చెప్పుచున్నా రనుమాట నావీనులకు విందు. అందు శుద్ధాంతకాంతలు చెప్పినకవిత్వ మంతఃపుర స్త్రీలవలెనే ఘోషాగలిగి పరదాచాటున నణఁగియుండక ప్రచురమగుట నాకుఁ బరమానందకరమైనవిషయము. ఈకవయిత్రీమణి యాంధ్రనారీమణులకు నుపయోగకరములైన గద్యపద్యకావ్యములను రచియించి, దేశభాషాసేవలను జేయునట్లు పరమేశ్వరుఁ డనుగ్రహించుఁగాక !”

* * *

( నిత్యప్రార్థనా గ్రంథమునుండి )

మ. కర మొప్పం దగు కీర్తిఁ దత్త్వవిధుల న్ధ్యానానురాగమ్మునన్
వరుసన్ బోధయొనర్చినావు మిగులన్ వర్ధిల్లె నాబుద్ధి నీ
వరయంగాఁ బరమేష్ఠికల్పుఁడవుగావా? నీదులీలాకృతిన్
మఱవన్ శక్యముగాదు నాకు మహితాత్మా! కృష్ణభూపాలకా!

మ. అరయంగా భవదీయమానసము నిత్యంబద్భుతాధ్యాత్మత
త్త్వరసాస్వాదనతత్పరంబగుచు నుత్కంఠాదృతిం జూపుఁగా
ని, రహిం గోరదు తుచ్ఛభోగముల, నిర్నిద్రంబు నీబుద్ధి; ని
న్నఱవన్ శక్యముగాదు నాకు మహితాత్మా! కృష్ణభూపాలకా!

మ. పరసంబౌ భవదీయనామ మమలస్వాంతంబునన్ భక్తులె
ల్లరుఁ గీర్తించి తరించిన ట్లబల నల్పజ్ఞన్ విలోలాత్మ నే
కరణి న్నిన్ను భజింపనేర్తు? భవదుఃఖం బెట్లుపో కార్తు? ని
న్నఱవన్ శక్యముగాదు నాకు మహితాత్మా! కృష్ణభూపాలకా!

మ. పరులన్మిత్రులఁబోలెఁజూతు వెదసంభావించి, లాలించి, యా
దర మొప్పన్ ధనమిచ్చి ప్రోచెదవు సద్ధర్మానురాగంబుతో
నారులన్ దీనులఁ గాంచినంతటనె యుద్యోగమ్ము లర్పించి, ని
న్నఱవన్ శక్యముగాదు నాకు మహితాత్మా! కృష్ణభూపాలకా!

గీ. దానమందునఁ గర్ణుని దాఁటినావు
శౌర్యమందున నీ కేరు సాటి లేరు
ధార్మికతయందు ధర్మావతార మనఁగఁ
గీర్తిఁ గాంచితి వీవు శ్రీకృష్ణభూప!

ఉ. ఎట్టిజపంబు సేసితినొ యెట్టితపంబులఁ బూనియుంటినో
యెట్టివిశేషదానముల నిచ్చితినో తొలిబామునందుఁ జే
పట్టితి మిమ్మువంటిగుణవంతుని వీరుని లోకమాన్యునిన్
గట్టిఁడి బ్రహ్మ నిర్దయతఁగాంచి మిము న్విడఁజేసెనక్కటా!

చ. కలకలలాడుమీనగు మొగంబును గాంచిననాఁటనుండియు
న్వెలవెలఁబోయె నెమ్మనము నీరజలోచన! యేమిసెప్పుదున్
గలవరపాటుతోడఁ గలకాలము నీగతి మిమ్ము వీడి నే
నిల భరియింపఁగాఁగలనె? యిట్టియభాగ్యపుజీవితంబిఁకన్.

చ. పరమదయాలవాలమగు భావము గాంచినమిమ్ము వీడుట
న్జిరసముపార్జితం బయినచెల్మి నశించెను దిక్కు దక్కె దు
ష్కరతరదుఃఖ మేర్పడె జగం బడరెన్నిరయంబుగాఁగ, నీ
విరహదవాగ్ని నన్నుడుక వెట్టెడి భస్మమొనర్పదో ప్రియా!

చ. గుణమణిరాశివంచు నినుఁ గోరి వరించిననాఁటనుండి ని
న్ననయముసఖ్యభక్తులమహాదృతిఁగొల్చుచునుంటిఁగాదె? మ
న్ననవిడి మానినిన్ నను ననాథగ నీగతి నొంటిఁద్రోచితే
యనఘచరిత్ర! నాబ్రదుకు వ్యర్థము నిన్గనలేమి మేదినిన్.

ఉ. జీవము నాదుసొమ్మనుచుఁ జెప్పితి వీవు వివాహవేళ నా
భావ మనన్యభావమొ యభావమొ? లేక మనమ్మునందు నే
భావము నెంచి నీ విటులఁ బాసితివో తెలియంగరాదు నా
భావముమాత్ర మెన్నఁడును బాయదు నీపదపద్మయుగ్మమున్.

ఉ. నే నొక బాసఁ జేసెదను నెచ్చెలి! విన్ము పురాకృతమ్మునన్
నే నినుఁ గోలుపోయితి, ననేకవిధమ్ముల నూఱడిల్లినన్
మానదు దుఃఖ మెంతయును మాటికిమాటికిఁ బొంగివచ్చెడి
న్నే నెటొ నాల్గునా ళ్లిచట నిల్చి వడి న్దివి నిన్నుఁ గూడెదన్.

మ. పతియే దైవమటంచు నెంచి మది సంభావించి ప్రేమించి సం
తతము న్నీమృదుపాదపద్మములకు న్నామ్రొక్కు లర్పించుచున్
వ్రతమన్న న్జపమన్న భాగ్యమనిన న్నా కెప్డు మీరంచు స
మ్మతి సేవించుట మీ రెఱింగియును నన్బాయంగ న్యాయంబొకో?

మ. పరదేశమ్మున కేగునప్డు నను సంభావించి లాలించి నీ
వరయన్ వీడఁగ లేక వీడుటలు నేఁ డాత్మన్ విచారింపఁగాఁ
గరమున్ దుఃఖము వచ్చు నిట్టియెడ నాకారుణ్య మెందేగెనో
పరలోకమ్మున కెట్టు లేగితివొ? నన్బాయంగ నెట్లోర్చితో?

ఉ. మూఁడుదినంబు లేగకయె మోదమెలర్పఁగ వత్తునంచు నీ
వాడినమాటలన్ దలఁచి హాయిగ నేగితిఁగాని యక్కటా!
పోడిమిఁ దక్కి నన్నిటుల మోసముచేసి దివంబుఁ జేరి, తే
నాఁడును నిట్టులౌనని మనమ్మున నెంచఁగనైతి భూవరా!

ఉ. ఎప్పుడు తెల్లవారు మఱియెప్డు దినత్రయ మేగు నింక నే
నెప్పుడు మీముఖాంబుజము నేర్పడఁ జూచెడు భాగ్యమబ్బునం
చెప్పటికప్పుడే దినము లెంచుచునుంటినిగాని యక్కటా!
ముప్పు ఘటిల్లునంచుఁ దలపోయఁగనైతిని ప్రాణనాయకా!

ఉ. అట్టి కఠోరవార్త వినినంతటనైనను గుండె వ్రీలి ని
న్నెట్టులనైనఁ జేరుటకు నెంచనిజీవిత మేల నాకు? నె
ప్పట్టుననైన శాంతిఁ గనవచ్చునె? తాపముఁ బాయ నేర్తునే?
యిట్టులె పొక్కిపొక్కి కృశియింపుమటంచు విధాత వ్రాసెనే?

గీ. అట్టిసుకృతంబు నా కేటి కబ్బుఁ? దొంటి
బామునం దొనరించిన పాపఫలము
ననుభవింపక తీరునే? యైనఁ బగుల
దెట్టిలోహనిర్మితమొ నాహృదయ మకట!

గీ. బూదిఁ బోసినపన్నీరువోలె, నడవిఁ
గాచినట్టి వెన్నెలమాడ్కి, నోచినట్టి
నోము లన్ని వ్యర్థము లయ్యె నేమి సేతు?
నీవు లేనట్టి బ్రతు కింక నిష్ఫలంబు.

ఉ. పిల్లల కొండుదారి కనుపించదు, నీసుకృతంబు పెంపునన్
మెల్లగ జారినావు మితిమీఱినదుఃఖమహాంబుధిన్ మమున్
ద్రెళ్ళఁగఁ ద్రోచి, యిట్లు తగునే? భగవానుఁడె దిక్కటంచు నీ
వల్లనఁ జెప్పుసూక్తులె కటా! శరణంబులు మాకు భూవరా!

శా. ఎన్నంజాలుదు నీపదాబ్జయుగమే యెన్నాళ్ళకైనన్ నను
న్మన్నింపంగదె నిన్ను వీడఁటను యుష్మద్దివ్యనామాళినే
యెన్నంజాలు మదీయజిహ్వయును నిన్నే భర్తగా నెంతు నే
నెన్నండైనను జన్మజన్మములకున్ గృష్ణా! మనోనాయకా!

ఉ. నీతలిదండ్రులన్న ధరణీధవ! వృద్ధులటం చెఱుంగవో
చేతము దుఃఖదుర్భరత చేఁగడుఁబొక్కఁగఁగన్నులుండియున్
నీతనుభాగ్యమున్ గనఁగనేరక వారట నంధులైరి; నా
థా! తపియింపఁజేయుటలు ధర్మమె జీవితశేషమంతయున్?

ఉ. చిన్నతనంబునుండి నినుఁజేరి సుఖించుచునుంటి నాత్మలో
నెన్నఁడు నిన్నుఁబాసి వసియించినదానను గాన; యట్టినే
యన్నులమిన్నయైననను న్యాయ్యమె పాసిచనంగనింకెటుల్
తిన్ననిమార్గ మేర్పడు సుధీవర! వేంకటకృష్ణభూవరా!

సీ. శ్రీధర ! నీ కెప్డు సేవసేయుటె కాని
యన్యుల సేవింప నరుగ నొకట
పుండరీకాక్ష ! నిన్ బూజసేయుటె కాని
యితరపూజలఁ జేయ నెంచ నొకట
దైత్యారి ! నీ కేను దండం బిడుటె కాని
పరులకుఁ జేమోడ్ప దరియ నొకట
పరమాత్మ ! నీనామభజనసేయుటె కాని
తదితర మేదియుఁ దలఁప నొకట

గీ. ఇన్నివిధముల నినుఁ గొల్చుచున్న నాకుఁ
బ్రాణములకును బ్రాణమౌ పతినిఁ బాసి
పాడుబ్రదుకొంది జీవచ్ఛవంబ నగుచుఁ
జెలఁగుదౌర్భాగ్య మేల కూర్చితివి తండ్రి!

సీ. తలఁపులోఁ బ్రాణేశు దైవంబుగా నెంచి
ముద్దుముద్దులందునఁ బూజసేసి
విభుఁడు పల్కినపల్కు వేదాక్షరంబుగా
నెల్లవేళలయందు నెంచుచుండి
పతిపాదపూజయే వ్రతమంచు నిత్యంబు
సద్భక్తితోడుత జరపుచుండి
పతిచిత్త మారసి పనులందు బహుభక్తిఁ
గలిగి యెక్కాలంబు మెలఁగుచుండి

గీ. వంక లేనట్టిమార్గంబుఁ బట్టుచుండి
యిరువదేడులు కాఁపురం బేను జేయఁ
బిన్నతనమందె నా కిట్టిపాట్లు కలుగఁ
జేయుటలు నీకు న్యాయ్యంబె? శ్రీనివాస!

గీ. ఎట్లు దాఁటంగ శక్యమా నీదురంత
మైనసంసారజలరాశిఁ? గాన, భార
మంతయును దేవ! నీవ మోయంగవలయు;
నావికుఁడ వీవ, దరిఁ జేర్చు జీవనౌక.

మ. పతినిన్ బాసినదాది దుఃఖములకున్ బాలైతి నే నింక నే
గతి వేఁగంగలదాన దేహముపయిన్ గన్పట్టెఁ జీకాకు నా
వెతలన్బాపఁగలట్టివా రెవరు నీవేకాక యెట్లైననా [ప్రభూ!
ధృతిమై దారినిఁజూపుమయ్య యిఁకఁదండ్రీ! రామచంద్ర

చ. మెలఁగితిఁ బ్రాణ మొక్కటిగ మేనులు రెండుగఁ గానుపించినన్
గలిసితి నాత్మలోపలను గాంతుని బూవును దావిరీతి నేఁ
గలిసి సుఖాప్తి వర్తిలితిఁ గష్టమెఱుంగక యిప్డు దైవమా!
కలుగఁగఁ జేసితే పరులకష్టము లోర్వనినాకుఁ గష్టముల్.

ఉ. చిన్నటనాఁటనుండియును బ్రేముడిఁ జూపెడివాని స్నేహసం
పన్నతఁ గాంచువాని నిజభావము నాయెడ నుంచువాని నా
యన్నులమిన్నయంచు నను నాత్మఁదలంచెడు ప్రాణనాథునిన్
గ్రన్నన మ్రింగెనయ్యయొయ కాలపుమృత్యువు వేంకటేశ్వరా!

గీ. అట్టిసద్గుణగణరాశి నక్కటకట!
కోలుపోయి యనాథనై కూలిపోతి
దారియున్ డొంకఁ గానక తల్లడిల్లు
చుంటిఁ గృపఁ గాంచి దరిఁ జేర్పు మోయి దేవ!

సీ. పతిముఖాబ్జముఁ జూచుభాగ్య మొందనికండ్లు
కండ్లుగా వవి సోర్ణగండ్లుగాని
జీవేశునకుఁ బ్రదక్షిణ మొనర్పనికాళ్ళు
కాళ్ళుగా వవి కారురాళ్ళుగాని
ప్రాణేశునామకీర్తనముఁ జేయనివాయి
వాయిగా దది పాడుగోయిగాని
ధవునకు సాష్టాంగదండ మీయనిమేను
మేనుగా దది ముండ్లమ్రానుగాని

గీ. కానఁ బ్రాణేశుఁ గొల్చుభాగ్యంబె భాగ్య
మట్టిభాగ్యంబుఁ గోల్పోయి యవిధి గుడుచు
నిట్టి కాఱగాని బ్రతుకు నా కిచ్చి తేల ?
దీనబాంధవ ! నా కేది దిక్కు కలదు ?

ఉ. నాన్నయటంచుఁబిల్లలు మనమ్మున శోకదవాగ్నితప్తులై
నన్నడుగంగఁ జెప్పుటకు నా కిఁక నోరెటులాడు దైవమా!
చిన్నతనానఁ గష్టములఁ బెట్టితి వయ్యది గుండె బ్రద్దలౌ
నన్నవిధంబునన్ మనము నాఱటఁ బెట్టుచునుండు నిచ్చలున్.

మ. నినుఁగీర్తించుచు నీకథల్వినుచు నిన్నే ధ్యానము న్జేయుచున్
మనమం దెప్పుడొకింతయేని మఱవన్ రాదంచు నన్నావుమం
చును నీవేయిఁక దిక్కటంచు ఘనమౌ శోకమ్మునందున్న నే
ననయమ్మున్నినుఁ గొల్తుఁ బ్రోవఁగదె రామా! దీనచింతామణీ!

ఉ. పాలు జలంబు నేకమగుభాతిని నాదగు ప్రాణనాథునిన్
జాలదినాలనుండి సరసంబుగఁ గూడి మెలంగుచుండ నా
పాలిటిదైవమంచు నెద భావనసేయుచుఁ గొల్చుచుండ నీ
వేలొకొ? నిర్దయుండవయి యీగతిఁ జేసితి వేంకటేశ్వరా!

చ. జననము వ్యర్థమాయెనని చాలఁ గ్రుస్సుచు నున్నదాన నే
ననయము శాంతివీడి మనమందున బెంగనుగాంచుచుంటి నే
మని వచియింప నేర్తు నిఁక నక్కట! ధైర్యము చిక్కదాయె నో
యనఘ! భవత్పదాబ్జముల నంటితిఁ బ్రోవుము వేంకటేశ్వరా!

ఉ. ఎట్టిమహాపరాధముల నేఁ దొలిబామునఁ జేసియుంటినో
యెట్టిగుణాఢ్యులన్ వెత వహింపఁగఁ జేసితినొక్కొ లేనిచో
నట్టినృపాలశేఖరు మహాత్ము గతాయువుగా నొనర్చి నా
కిట్టివియోగ మూన్పఁగలవే? దయమాలుచు వేంకటేశ్వరా!

ఉ. పిన్నతనంబునుండి ననుఁ బ్రేముడిపెంపున నాదరించి నా
పెన్నిధియై యహర్నిశము వీడని వేంకటకృష్ణరాయు నే
నెన్నిభవంబులెత్తినను నేమరుపాటొకయింత లేక బల్
తిన్నగఁ గూర్పుమా పతిగ దేవ! రమాపతి! వేంకటేశ్వరా!

ఉ కోరికలెల్లనాకునొడఁగూర్చె ననుం బ్రియమొప్పఁ జూచె సం
సారము నాపయిన్ వదలి శాంతిని నీదరి కేగె నిప్డు నే
తీరనిదుఃఖవారినిధిఁ దీరము గాంచఁగలేకయుంటి న
న్నారసిప్రోవుమంటిఁ బరమాత్మ! తరిం దరియింపఁ గూర్పవే.

మ. గురుగంభీరగుణాకరు న్విడుచుటన్ గోల్పోతి భాగ్యంబు
ర్భరవైధవ్యవిషాగ్నికీలల భరింపంజాల నన్నెట్లో నీ [దు
దరిఁ జేర్పంగదవయ్య నాపతిని సందర్శించుభాగ్యంబు చే
కుఱఁ జేయంగదవయ్య! కొల్తునెపుడున్ గోపాలచూడామణీ!

ఉ. అన్నలుదమ్ములుద్ధనబలాయము గూర్చినఁ గూర్చవచ్చు సం
పన్నతగల్గుతల్లి యభిమానము సూపినఁ జూపవచ్చుఁ దాఁ
[గన్నన బంధుకోటి యనురాగము పెంచినఁ బెంచవచ్చు సం
పన్నిధి యెంతగల్గినను వ్యర్థమగున్ బతిలేని భామకున్.

గీ. పతియె కులకాంత కెపుడు దైవంబు పరము
పతియె ప్రాణంబు మిత్రంబు పతియె గురువు
పతియె సర్వస్వమగు నట్టి పతిసుగతినిఁ
బాయు సతి కన్యగతి గానఁబడునె జగతి.

సీ. పతినామభజనతత్పరతఁ జొక్కునిజిహ్వ
కలిగియే మిఁక నద్ది గలుగ కేమి?
భర్తృపాదాబ్జసేవలఁ దరింపనిచేయి
కలిగియే మిఁక నద్ది గలుగ కేమి?
హృదయేశుసూక్తి సంప్రీతిఁ దేరనియాత్మ
కలిగియే మిఁక నద్ది గలుగ కేమి?
దయితోపచారతన్మయతఁ బొంగనిమేను
కలిగియే మిఁక నద్ది గలుగ కేమి?

గీ. అబల కెంచను బతియె ప్రత్యక్షదైవ
మగుట సర్వేంద్రియముల నవ్యయసపర్య
సలుపుసతులకె యవి యున్నఫలముగాని
గలుగ దసతుల కవి యున్నఫలము సుంత.

సీ. పతిపాద మనయంబు భజియించుమా యంచుఁ
దగవొప్ప వచియించుతల్లి తల్లి
పతినామ మేవేళ నుతియించుమా యంచుఁ
దటిఁగాంచి బోధించుతండ్రి తండ్రి

పతిసూక్తి నిరతంబు భావించుమా యంచు
గుణ మెంచి వినిపించుగురువు గురువు
పతిపూజ ముప్పొద్దుఁ బచరించుమా యంచుఁ
జెయి వంచి చేయించుచెలియ చెలియ

గీ. పతిని దైవంబుగా నెంచుభార్య భార్య
మగని నెవ్వేళఁ బూజించుమగువ మగువ
ధవునితోడిదె లోకంబు తరుణి కెపుడు
ప్రాణనాథుండెగతిసుమ్మ భామ కెందు.

12/55



# 8. గురుపరితాపము



[ వాజపేయయాజుల రామసుబ్బారాయఁడు. ]

సీ. ఏ ఱేఁడు పిలిపించి గారాబమున దరిఁ
జేర్చె బిడ్డలకు దేశికునిఁ జేసి
ఏ దాత నిరతంబు నెనలేనిగౌరవో
న్నతి నన్నుఁ జూచె సన్మాననియతి
ఏ దొర యెంతేని మోదమ్ము దైవార
వాంఛితార్థంబులఁ బడయఁ జేసె
ఏ రాజు కవి నంచు హితబుద్ధిఁ బోషించె
భాషాభిమానంబు ప్రబలునట్లు

గీ. అట్టి యినుగంటి కృష్ణరాయావనీంద్రుఁ
డవనిఁ బాసె ననఁగ దుఃఖ మతిశయించె;
నెట్లు సెప్పుదు నాబాధ యిట్టి దనుచు ?
దైవగతులను దెలియంగఁ దరముగాదు. 1

చ. ఎనిమిదివత్సరంబులు రహించితి బిడ్డలకున్ గురుండనై
యెనయఁగరానిభాగ్యముల నే డైఱఁగాంచుచునుంటినీకృప
జ్ఞుఁడవు రాజచంద్రుఁడవు గౌరవమారఁగ నన్నుఁ జూచుచుం
డినకృపయిం కెటుల్దొరకు నేఁడు మొదల్వచియింపు మోనృపా!

ఉ. ఈవు పరోపకారమన నెన్నఁడు వెన్కకుఁదీయఁబోవు సం
భావనసేయు దీవు కవిమాన్యుల; నాకవితాప్రసంగముల్
నీ వనయంబు నిచ్చఁగొని నిశ్చలభక్తిని వింమ వక్కటా !
యేవిధి నిన్ను వీడి భరియింపఁగలాఁడను దుఃఖభారమున్.

ఉ. నేనన నీకుఁ బ్రాణమని నీవు వచింపఁగలేదె నాఁడు 'నా
సూనుఁడు మీగురుత్వమున శోభితుఁడయ్యెను, మీకు భూరిస
న్మానము సేయనొప్పు'నని మాటికి నీహృదయంబు విప్పి వా
గ్దానము సేయలేదె? కలఁగాంచినకైవడి నయ్యెనన్నియున్.

గీ. బ్రతుకుచుండిరి ప్రజలు నీప్రాపుఁ గాంచి
వారి నెవ్వారు పోషించువారు చెపుమ ?
నిన్నుఁ బోలినయాత్మవిభుండే గతింప
వారికై చింత యేటికో ప్రభువరేణ్య ! 5

ఉ మానవరాజచంద్రుఁడవు మాటయొసంగియొకింత దాటఁగాఁ
బూననివాఁడ వీవు పరిపూర్ణమనంబున బీదసాదలన్
మానక గాచుచుందువు సమానులెయెల్లరు నీకు, సప్తసం
తానఫలంబు గాంచితివి తక్కువ యేమిఁక నీకు? భూవరా!

గీ. కాని నీ వేగునుత్తరక్షణమునందె
మాకు లోటు గాన్పించె నోమనుజనాథ !
చెప్ప నేటికి మాబాధ చిచ్చులోనఁ
బడినరీతిగ బ్రతు కంత వ్యర్థమయ్యె. 7

గీ. నాఁడు ప్రజలెల్లఁ బడినసంతాపభరమె
చెప్పకుండఁగఁ జెప్ప నీగొప్పశక్తి
మరల సృజియింపలే నిట్టిమాన్యు నంచు
బ్రహ్మయునుగూడ నాత్మలో వగవకున్నె ? 8

ఉ. నీజనయిత్రి పుణ్యతమ; నీజనకుండును బుణ్యమూర్తి; నీ
తేజు భరించుజాయయుఁ బతివ్రత, తత్త్వనిరూఢ, మాన్య; నీ
వో జవసత్వముల్ గనినయుత్తమశూరుఁడ; విన్నిగూర్చి నీ
కాజలజాసనుం డెటు చిరాయువు గూర్పకపోయెనో గదా!

సీ. పండితుం డనినంతఁ బరమభక్తిని బిల్చి
మించువేడుక గౌరవించినావు
కవిచంద్రుఁ డనినంత గాఢభక్తిని బిల్చి
మించువేడుక నాదరించినావు
గాయకోత్తముఁడనఁ గడుభక్తిఁ బిలిపించి
మించువేడుకఁ బ్రస్తుతించినావు
గురుజనంబులటన్న గురుభక్తిఁ బిలిపించి
మించువేడుక సత్కరించినావు

గీ. సాధువులు బంధువులు దీనజనులు సేవఁ
జేయువార లటన్నను జేరఁదీసి
మించువేడుకతోడఁ బోషించినావు
కీర్తిధారేయ ! యినుగంటి కృష్ణరాయ ! 10

సీ. నిను( జెప్పి పదపడి యిను( జెప్పవలె(గాదె
పరికటపరితాపసంపత్తియందు
నిను( జెప్పి వెనుక నిందురుని( జెప్పవలె(గాదె
యతులితభోగభాగ్యములయందు
నిను( జెప్పి పిదప( జందురుని( జెప్పవలె(గాదె
భవ్యప్రసాదవైభవమునందు
నిను( జెప్పి యవల( గాముని( జెప్పవలె(గాదె
యిద్ధసౌందర్యసమృద్ధియందు

గీ. నిన్ను( జెప్పినవెనుకనే నిక్కముగను
జెప్పవలె(గాదె కర్ణుని శిబిని( గామ
ధేనువును గల్పకంబును దానమందు(
గీర్తిధారేయ! యినుగంటి కృష్ణరాయ! 11

ఉ. దైవము దీక్షతో మనిచి దగ్గఱ(దీయ(దలంచువాని( దా
నేవిధినైన( బ్రాయమున నే తనసన్నిధి(జేర(దీసికొం
చావల వాని కాత్మవిభవావళి నిచ్చి భరించునందు రో
పావనసచ్చరిత్ర! భగవత్కృప నీపయి నిట్టులుండనో!

ఉ. సారములేనిమానవులజన్మము మెచ్చక కాఱుచీ(కటుల్
బేరకమున్న నిన్ను నడిపించెడినిర్మలధర్మబుద్ధి లో(
జేరిచి సర్వవేళలను శ్రీపరమేశ్వరభక్తిభావనా
పూరితమానసుండవయి పోయితివే దివికిన్ నృపాలకా! 13

సీ. నిన్ను దైవంబుగా నెన్ని పూజించెడి
కాంత శోకాగ్నిచేఁ గ్రాఁగుచుండ
నిన్నుఁ బ్రాణంబుగా నెన్ని మెలంగెడి
సన్మిత్రు లార్తిచే స్రగ్గుచుండ
నిన్ను రక్షకునిగా నెన్ని సేవించెడి
సేవకుల్ దుఃఖంబుఁ జెందుచుండ
నిన్నుఁ గల్పకముగా నెన్ని యాచించెడి
యాచకుల్ గతిలేక యడలుచుండఁ

గీ. గన్నవారలు చుట్టాలు గాసిగుడువఁ
జక్క దివ్యవిమానంబు నెక్కి యూర్ధ్వ
లోకసంచారసుఖ మొంద నీకుఁ దగునె
కీర్తి ధౌరేయ ! యినుగంటి కృష్ణరాయ ! 14

ఉ. సేవకమానసాంబుజవశీకరణార్హ్యవివక్ష పాండితీ
భావితసత్కవిత్వరసభావపరీక్ష కృపాకటాక్షసం
భావితసాధురక్ష జనభద్రదిదృక్ష పరోపకారభి
క్షావిధిదీక్ష నీకడ విచక్షణతం దగు నక్షయంబులై. 15

ఉ. భావవిశుద్ధి సర్వహితవాక్ప్రియకర్మసమృద్ధి శిష్టసం
భావితధర్మబుద్ధి కవిపండితపోషణధీవివృద్ధి వి
ద్యావినయార్థసిద్ధి యసహాయసమాదరణప్రసిద్ధి మై
త్రీవిభవాభివృద్ధి జగతీధవ! నీయెడఁ గానుపించెడిన్. 16

సీ. పరభామినీసహోదరుఁ డీతఁ డను నీతి
శాశ్వతం బగునట్లు జరిపినావు
సత్యభాషాహరిశ్చంద్రుఁ డీతం డను
దృఢచిత్త యశోఽర్థము సేకరించినావు
సంపూర్ణకారుణ్యసాగరుం డీతఁ డన్న
మించువిఖ్యాతి నార్జించినావు
రసికావతంసుఁ డీరాజచంద్రుఁ డటన్న
పెద్దపేరు వహించి వెలసినావు

గీ. అతులవైమానికోత్తముఁ డనుయశంబుఁ
గాంచినాఁడవు ; వేఁట నీకంటె ఘనుఁడు
ధరణి నెందును లేఁడనఁ దనరినావు
కీర్తిధారేయ ! యినుగంటి కృష్ణరాయ ! 17

ఉ. అక్షయసత్కృపారసము సాదరమేదురచిత్తవృత్తి ప్ర
త్యక్షమహేంద్రవైభవసమంచితభూతి విశాలకీర్తి హ
ర్యక్షసమానకాంతి శరణాగతపాలనదీక్ష మీయెడన్
రక్షణఁబొంది రాజగుణరాజి విరాజిలుఁ గృష్ణభూవరా !

ఉ. నీతికిఁ బుట్టినిల్లు ధరణీసురకోటికిఁ బట్టుఁగొమ్మ పు
ణ్యాతిశయాకరంబు కరుణావరుణాలయ మాత్మభూమిప్ర
ఖ్యాతికి మూలకంద మహహా! శుభకీర్తికి ఠాణ యైన మీ
చేత సరస్వతీరమణచేతము భక్తిపరీత మయ్యెడిన్. 19

శా. నీవైమానికవిద్య నిర్జరులకున్ నేర్పింప నూహించి యా
దేవేంద్రుం గన నేగియుంటి వనుబుద్ధిం బొందితి కాకున్న మా
భావం బేగతి సైపఁ జాలును హఠాత్పాతంబుచే నీవిటుల్
పోవన్ దీనజనావనప్రవణ! యీలోపం బెటుల్ తీరునో?

తే. ఈవిమానంబు బ్రద్దలై పోవునప్పు
డెంతశ్రమపడినావొ మా కేమి యెఱుక
తలఁచినంత మాగుండె బ్రద్ద లగుచుండె
ననిన నీలోన నెంతగా వనరినావొ ? 21

తే. ఈవిమానయానంబె నిన్నిటులఁ జేసె
ననుచు లోకు లెల్లరు నాడుకొనుట కేమి ?
బ్రహ్మ వ్రాసినవ్రాఁత నెవ్వారు దాఁటఁ
గలరు తెలియరా దిట్టిసూక్ష్మంబు మనకు. 22

గీ. నిన్ను విఖ్యాతచారిత్రునిం బొనర్చె
నీవిమానయానంబె యన్నిదిశలందు
వట్టిప్రఖ్యాతిఁ జూచిన హర్ష మబ్బుఁ
గాని యీఘోరవార్త దుఃఖంబు నిచ్చు. 23

ఉ. ఎందఱు రాజరాజులు మహీస్థలిఁ బుట్టరు, గిట్ట రెంద ఱీ
యందముచంద మందిరె? మహాద్భుతశౌర్యవికాసశేముషీ
మందిర ! దివ్యసంపదభిమానితవాయువిమానయానజా
నందరసానుభూతిఁ గనినారలె? నీవలెఁ గృష్ణభూవరా !

శా. సవ్యస్తవ్యపథావలంబననిరీక్షన్ ధైర్యశౌర్యక్రియా
భావోల్లాసవిలాస మింపెసఁగ నీప్రావీణ్యమున్ జూపి దే
హావ్యాయామకళాకలాపములఁ బూర్ణాసక్తితోఁ బ్రోచుటన్
శ్రావ్యంబయ్యెను నీపవిత్రకథ లార్యావర్తమం దంతటన్.

శా. ఆయుర్దాయము స్వల్ప మయ్యెను భవ
త్ప్రారంభసంరంభ మెం
తో యుత్సాహము ధైర్యసాహసము ధ
న్యోల్లాస మంచత్కళా
శ్రేయోదాయకకార్యశూరతలు పెం
చెన్ దిక్తటిం గీర్తిఁ; బూ
ర్ణాయుర్దాయ మొసంగఁడయ్యె నజుఁ డ
న్నా ! నీకు ధీశాలికిన్. 26

గీ. మేము తొలి నోఁచికొన్నట్టి నోము కొంచె
మగుట నేరీతి గొప్పపుణ్యంబు గల్గు ?
కాని మీదుఘనతఁ జూచి యైన సంత
సించుచుందుము మేము జీవించుదాఁక. 27

గీ. ఈవు తలపెట్టుకార్యంబు లెల్ల సఫల
మౌటయేకాని విఫలము లౌట యెఱుఁగ ;
మిప్పు డిటులౌట కొకహేతు వెసఁగునొక్కొ
దైవబలశూన్యత యొకండు దక్క వేఱ. 28

గీ. నీకు ధైర్యంబె దైవంబు నిన్ను మించు
వార లేజాడనైనను లేరు; నీవు
గొప్ప వైమానికుఁడ వంచు మెప్పుఁ గాంచు
చుండ, దుర్విధి యిటు సేసె నోర్వలేక. 29

గీ. పుణ్యకార్యముల్ చేసినపూరుషులకు
నెదురువచ్చు విమాన మోకృష్ణరాయ !
పుణ్య నిను శీఘ్రముగ స్వర్గమునకుఁ గొంచు
నరుగ హరి పంపెనె విమానవరము, నవము ? 30

గీ. ఈవిమానయానము గూడు నెట్లు, నిన్నుఁ
బోలు వీరకులోద్భవభూపతులకుఁ
గాక ; యందుచే నీవు స్వర్గంబు చేరి
నా వనుచు నాత్మలోన సంతసముఁ గాంతు. 31

క. వీరుఁడవై నీవు మహా
దారుఁడ వైయుంటఁ బడయఁ దగె నీకు నృపా !
వీరస్వర్గానర్ఘ
శ్రీరతి, యిఁక నాత్మశాంతి చేకుఱు టరుదే ? 32

ఉ. భార్గవునైన డీకొనెడుప్రజ్ఞను గాంచినవాఁడ వీవు సం
సర్గముగూడ గొప్పది ప్రసన్నగుణాఢ్యుఁడ వీవు చూడఁగా
దుర్గుణమొండు నీయెడలఁ దోపదు నీకుఁ బరాత్పరుండు దా
స్వర్గసుఖంబొసంగుచుఁ బ్రశాంతినిఁగూర్చుతనీదునాత్మకున్

మ. సరసాగ్రేసరుఁడీతఁడంచును భవత్సౌందర్యము న్గాంచి ని
ర్జరవేశ్య ల్భ్రమిఁజెంది స్వర్గమునకు న్బ్రార్థించికొంపోవఁగాఁ
గరుణన్ వారి సుఖింపఁజేయఁగ మదిన్గాంక్షించియచ్చోటి కి
నరలోకంబును బాసి యేగితివొ కృష్ణారాయభూపాలకా!

శా. నీ కీలోకమునందుఁబట్టణములన్ నిక్కంబుగా నెందునా
లోకింపన్దగుకాంతులేమిని మరుల్లోకంబు నీక్షింపఁగా
నాకాంక్షించితివేమొ కానియెడ నీ వందేగియున్నందు కే
సాకుంజెప్పఁదలంచితయ్యయికఁగృష్ణారాయభూపాలకా!

చ. బ్రతికిననాళ్లునాళ్ళు నిరవద్యవినిర్మలజీవితోన్నతిన్
బ్రతికితి వీవు, భూప్రజ లభాగ్యులు, మీరు దివంబుఁ జేర నే
గతి బ్రతుకంగలారమని కాలము నెట్టుట కష్టమంచు లో
నతిభయమందుచుండిరి దురంతవిషాదమహాబ్ధిమగ్నులై.

ఉ. ముప్పదిపైన నెన్మిదియుఁబూర్తిగ నిండకముందె యక్కటా
తప్పనిదయ్యె మృత్యువని తాపముగల్గెను మాకుఁ, గాని పే
రుప్పతిలంగ సద్యశమహా! దిశలందునఁబ్రాకఁ జేసి నీ
వప్పుడె స్వర్గలోకసుఖ మందితివన్నఁ బ్రశాంతిగల్గెడిన్.

మ. కలదే కన్నులపండువైనభవదాకారంబు నీక్షింపఁగాఁ
గలభాగ్యోన్నతి స్వప్నమందయిననో కామాకృతీ! మాకు? నీ
చెలికిన్ జుట్టలకైనఁ జూపు మది వీక్షింపంగ నేతద్వ్యథా
జ్వాలనంబైన నాకింతఁజల్లఁబడుఁ గృష్ణారాయభూపాలకా!

సీ. నీకీర్తిఁ గని శోకనికరంబు చంద్రికా
శంక దూరము వారు జంకి జంకి.
నీకీరితి చకోరనికరంబు కని పండు
వెన్నెలయని చేరు వేడ్కమీఱ.
నీకీర్తి కువలయనికరంబు కని జోత్స్న
యనుకొని వికసించు హర్షమొంది.
నీకీర్తి పంకేజనికరంబు కని శశి
కాంతిశంక ముడుంగు వంత నొంది.

గీ. చంద్రికాంతంబులును భవత్స్వచ్ఛకీర్తి
చంద్రికాలోకనంబున జాలువారుఁ
బట్టపగలైన నోక్కొక్కపట్టునందుఁ
గీర్తిధారేయ! ఇనుగంటి కృష్ణరాయ! 39.

శా. చింతాపావక హేతిసంతతికి మాచిత్తంబు లేరీతిగా
సంతాపించిన నేమిగాని యదె రాజా! చూడు సంతానముం
జింతారత్నము కామధేనువును నిన్వీక్షించుచో నెంతగా
సంతాపించెడినో యెఱుంగుదువె? కృష్ణారాయభూపాలకా!

ఉ. తెంపున నీవిమానము నదేవనిగాఁ దలయెత్తిచూచి నీ
పెంపుడుకుక్క నిన్నపుడు వీడనిదాటను వెంబడించె నీ
పంపు శిరంబునం దిడుచుఁ బ్రాణము నీకయి కోలుపోయెఁదా
సొంపుగ నందె మోక్షము విశుద్ధచరిత్రుని నిన్నుఁ గూడుచున్.

ఉ. పిల్లలు పిల్లలైరి సతి పెద్దదిగాదు విశేషకాలమా
చెల్లఁగలే దిఁక న్మసలిచీఁకులు తల్లియుఁదండ్రియుం గటా!
మెల్లఁగ జాఱినావు మితిమీఱినదుఃఖములోనఁద్రోసి యిం
కెల్లవిధాల నొవ్వడరె నేమి వచింతును గృష్ణభూవరా!

ఉ. పుత్రులు ముగ్గురంచు నెదఁబొంగుచునుంటెను నీదుతల్లిబల్
చిత్రముగాఁగ నిర్వురు త్యజించిరి గేహము బాల్యమందె, యే
మాత్రము బెంగఁగాంచక సమర్థుఁడవైననినుం దలంచి తా
పత్రయ మొందకుండఁగడపన్ దలపెట్టె దినంబులన్నియున్.

ఉ. వారలలోన నొక్కఁడు దివంబున కేగె నటన్నవార్త గం
భీరమనంబులో నణచి బిట్టుతపించుచునుండ నంతలోఁ
జేరెఁగనిష్ఠుఁ డింటికని చెప్పఁగ శాంతివహించె నిప్పుడీ
ఘోరదురంతవార్త విని క్రుంగదె నీజనయిత్రి భూవరా!

ఉ. ఇద్దఱుపుత్రులంచు మదినెట్టులొ ధైర్యముగాంచుచుండ నా
పద్దశకున్ సకాలమని భావనసేయుచునుండ నంతలో
నద్దిర నీవిమాన మకటా! విధికృత్యముచేత నెట్టులో
బ్రద్దలువాఱి నిన్నుఁబడవైచెను మృత్యుముఖంబునన్ నృపా!

గీ. దైవవిధిచేత మిగిలెఁ బుత్రుఁ డొకండె
తల్లిదండ్రుల కుండుసంతాప మింత
గాదు; తనువు లుండినదాఁకఁ గలఁతఁ బెట్టు
పుత్రశోకంబునకు మేర ధాత్రిఁ గలదె?

గీ. రాజ్యలక్ష్మ్యంబకడుపునఁ బ్రభవమంది
తల్లి వీరమాత యనఁగ నెల్లప్రజలుఁ
జెప్పఁగొనురీతి ఖ్యాతి నార్జించినావు
గాని తల్లికిఁ దీఱనిగాసి యిడితి. 47

గీ. వీరపత్ని యనెడుగొప్పపేరు గాంచెఁ
గాని సహియింపరానిదుఃఖంబుతోడ
నెట్లు జీవితాంతముదాఁక నిల్చి బ్రతుకఁ
గలదు నీకాంత నీవియోగంబు సైచి. 48

ఉ. తమ్ముఁడుజ్ఞానవంతుఁడయి తాఁ జనుదెంచెగృహోనకంచు, హ
ర్షమ్మును జెందినాఁడవు, ప్రసన్నగుణాఢ్యుఁ డతండుగూడఁ, జి
త్తమ్మున నిన్నుఁ జూడఁగ ముదంబును జెందె; భవత్సహోదరుం
డెమ్మెయినొంటియై చువసియించెడి నన్నలఁగోలుపోవుచున్.

ఉ. ఆపరమేశ్వరుండు సముదంచితలీలల నాదరించి ని
న్నాపరమందుఁ జేర్చి భవదాత్మకు శాంతినొసంగుఁగాక! ని
న్నాపరదేవతామణియు నాపరమందున నిల్పుఁగాక యం
చేపుగఁ జేయుచుండు నెద నెప్పుడు ప్రార్థన నోనృపాగ్రణీ!

సీ. వసుదేవసుతుఁడయ్యుఁ బసులకాఁపరులతోఁ
గూడి నిరంతరక్రీడ లాడె
భూపాలకుండయ్యుఁ బాపంబనక గోప
పల్లవాధరలతో వ్యభిచరించె

బలవంతుఁడయ్యు నబలఁ బూతనం జంపె
వృషభంబుఁ గూల్చెను వృజినమనక
గోవధం బొనరించెఁ గొలనాక, చోరుఁడై
గొల్లలపెరుగుపాల్ కొల్లగొనియె

గీ. ననుచు జనులెల్ల నిందింప యదుకులంబు
రోసి కృష్ణాకృతిని వీడి వాసిఁగోరి
వచ్చి యినుగంటివంశంబుఁ జొచ్చి కృష్ణ
రాయఁ డయ్యెను రుక్మిణీప్రాణవిభుఁడు. 51

ఉ. శ్రీమంతుండును బుద్ధిమంతుఁడుయశశ్శ్రీమంతుఁడున్ సద్గుణ
శ్రీమంతుండుఁ గవీంద్రగాయకబుధశ్రేయఃప్రదుం డూర్జిత
ప్రేమాకారుఁడు కృష్ణరాయబలవచ్ఛ్రేష్ఠుండు నీదృష్టి కిం
దామాన్యాత్ముఁడె గానిపించెనె కఠోరా! మృత్యుదుర్దేవతా!

మ. కల దే యింతటిక్రౌర్య మెందయిన నోకంజాతసంజాత! నీ
చెలికిన్ జుట్టములైనసత్కవులకున్ జేయూఁతయై సజ్జనా
వలికిన్ బ్రాపగుకృష్ణరాయనృపుసత్కాలంబునం దార! నీ
కల మేరీతి లిఖింపఁగల్గె నిటు స్తోకంబైన యాయుష్యమున్?

ఉ. 'వీరుఁడు కృష్ణరాయపృథివీపతి యింకను గొన్నివత్సరాల్
ధారుణి నిల్చియున్న ననుఁ దప్పకమీఁఖు,నగణ్యపుణ్యసం
భారసమగ్రసంగ్రహణపద్ధతి నాపద మాక్రమించు' నం
చోరువలేక యాతని నయో! కొనిపోయితివే శచీపతీ!

* * *

గీ. ఆధియో యిది, కొండొక వ్యాధియొకొ,
యమ్మ! నోరాడఁ బోదు నీయార్తిఁ దలఁప;
నెట్టు లోదార్ప నగు నాకు నింక నిన్ను?
నో సరస్వతి! యోదార్పకుందు నెట్లు? 55

గీ. ప్రాణపతి నిన్ను విడి యేగె నంచుఁ గంట
నీరు వెట్టకు వెత నహర్నిశము నిటుల;
ఆర్తి యొకనాఁటితోఁ దీఱనట్టి దగుటఁ
దల్లి! నీలోనె దిగమ్రింగఁదగును సైచి. 56

ఉ. పిల్లలఁజూచుకొంచుఁ గడుబెంగనుజెందక కాలమెట్టులో
మెల్లగ నెట్టు మమ్మ! మితిమీఱినభక్తిని నారమేశుఁడే
యెల్లెడ దిక్కటంచు మది నెంతయునమ్ముమ దాన నెట్టులోఁ
జెల్లును గాలమంతయును, జేకుఱు ధైర్యము జీవయాత్రకున్.

ఉ. పుట్టినవారికెల్లరకు ముందుగనో మఱికొంత వెన్కనో
గిట్టుటగూడఁ దప్ప దనుగీతి మదిం దలపోసి కాలమున్
నెట్టినచో సుఖంబుధరణిన్ లభియించు,విచార మొందుచోఁ
గిట్టినవారు వత్తురె? లగింపుమ ధైర్యము నెట్టులేనియున్.

ఉ. ఆపదలందు ధైర్యగుణ మంచితధర్మమటం చెఱింగి మీ
రీపగిదిన్ విచారము నొకింతయుఁ బాయకయుంట న్యాయమే
కాఁపురముండ వెన్నఁడును గష్టము లెల్ల నొకేవిధమ్మునన్
శ్రీపరమేశ్వరుండు గనఁజేయుత ధైర్యము జీవయాత్రకున్.

ఉ. రాజగు కృష్ణరాయగుణరత్నము నన్ను బహూకరించె మీ
కోజఁ బ్రియమ్మునన్ నుడివె, నూర్జితభక్తిని బాదుకొల్పి వి
భ్రాజితలీల నన్ను గురువర్యునిఁ జేసి కృపన్ వహింపఁగా
రాజితగౌరవోన్నతి నిరంతరమున్ గనుచుంటి నమ్మరో!

ఉ. ఆమహనీయుదర్శనమె యంతటితో సరిపోయెఁగాని త
ల్లీ! మఱి వారికంటెను ననేకవిధమ్ముల నన్ను మీరు సు
శ్రీమహితుంబొనర్త్రు; పొనరించుచునుంటిరి; లోటులేదు; కా
నీ, మది యేలొకో జడతనే వహియించి కృశించి కుందెడిన్.

* * *

ఉ. తల్లిరో! రత్నమాంబరో యెదన్దగు ధైర్యముగాంచుమమ్మ! నీ
కొల్లనివంత యేర్పడియె; నొక్కట శాంతి యొసంగ; దైన నీ
వల్లనె వృద్ధిగాఁగలుగు బాధ్యత కన్పడుచుండెఁ గాన నీ
పిల్లలఁ జేరఁదీసి యభివృద్ధికి మార్గముఁ జూపు మమ్మరో!

గీ. ప్రజలకై పాటుపడుచున్న రాణి వీవు
తత్త్వ మెఱిఁగిన విజ్ఞానధన్య వీవు
కాన విధివశమునఁ గల్గుకష్టములకుఁ
గలఁత నొందంగ రాదంచుఁ బలుకవలెనె? 63

గీ. అమ్మ! రాజ్యలక్ష్మ్యమ్మ! నోరాడ దమ్మ!
యేమి చెప్పుటకును గాని యెట్టులేని
ధైర్యమందుమ నీకుఁ బుత్రికుఁ డొకండె
కల్గినాఁ డంచుఁ గడవుమ కాల మెటులొ. 64



# 9. సహృదయానుతాపము



శ్రీరాజా వేంకటకృష్ణారావుబహద్దరుగారు స్వర్గతులయిన కొలఁదిదివసములకే తద్వియోగదుఃఖితులగు ననేకోద్యోగులును, సహృదయులును, పౌరజానపదులును గొల్లాపురమునందలి శ్రీలక్ష్మారాయ మిడిల్‌స్కూలునం దొక బహిరంగమహాసభ గావించిరి. పట్టారాని తమ దురంతసంతాపమును బ్రముఖులు బహుసంఖ్యాకులు బహుముఖముల బహుభాషల వ్యక్తీకరించిరి. అప్పుడు సంగ్రహింపఁబడిన రచన లిందుఁ బ్రకటింపఁబడుట యుక్తమైనను గ్రంథవిస్తర భీతిని ముఖ్యములగు కొన్నిమాత్రము మీఁకిందఁ బ్రకటింపఁబడినవి. మఱియుఁ బట్టణాంతరములనుండి శ్రీవారి పరిచితాపరిచిత పండితకవులు వ్రాసిపంపిన పద్యములుగూడ నిందుఁ బ్రకటింపఁబడినవి.

*   *   *

## అధ్యక్షోపన్యాసము

(ఉర్దునకు ననువాదము)

ఈమీఁటింగు శ్రీజటప్రోలుమహారాజ్ఞిగారి రెండవ యల్లుఁడుగారగు శ్రీరాజా ఇనుగంటి వేంకటకృష్ణారావుబహద్దరుగారి యకాలమరణము నెడ ననుతాపము తెలుపుకొనుటకై యేర్పడినదగుటచే నిట్టిమనోవేదన కలిగించు సం

దర్భమున నే నేమిచెప్పుటకును నోరాడకున్నది. వైకుంఠ వాసులగు శ్రీరాజాగారిజననము, విద్యాభ్యాసము, వివాహము, పరోపకారము మొదలగువిషయము లన్నియు వక్త లందఱు విమర్శగఁజెప్పియున్నారు. అందు ముఖ్యముగా మహారాజశ్రీ రామచంద్రరావు మునిసిఫ్‌సాహేబుగారు ప్రతి విషయమునుగూర్చి విపులముగ గంభీరోపన్యాస మిచ్చియుండిరి. ఇంతకంటెఁ జెప్పుటకు విశేషములు లేవు. కాని చర్విత చర్వణమైనను నాకృతజ్ఞత క్లుప్తముగ వెల్లడించుకొందును.

శ్రీరాజాబహద్దరుగా రొకగొప్పదాత. బీదసాదల కెంతయుఁ జేయూఁతనిచ్చుమహారాజు. మిక్కిలి తృప్తిగలవారు. పౌరుషజీవి. శౌర్యధైర్యసాహసముల కునికిపట్టు. వాయు విమానములను నడుపుటలోఁగల యద్భుతసాహసము, చాకచక్యము, తెలివి వర్ణింపఁ దరముగాదు. మనహిందూ దేశములో నిట్టికళలో నారి తేఱినవారు ముగ్గురు. మొదటి వారు శ్రీకేశవరావుగారికుమారుఁడు. రెండవమహనీయులు వీరు. మూఁడవవారు బాబర్‌మీర్జాసాహేబుగారు. వాయు విమానములను నడుపునుత్సాహమే శ్రీవారిశౌర్యమునకు నిదర్శనము. వేయేల? వీరు పరిమితిగల యీమానవజీవితములో సంశయవృత్తి, భయము కలవారు కారు. మరణము ప్రతిజీవికిని నెన్నటికైనను దప్పదు. కాని యిట్టియకాలమరణము దుర్భరము. వార్ధకమున మరణించినచో విచార మంతగ నుండదు. ఇట్టి లేఁబ్రాయములో నిట్టి మహావీరునిమరణము శోచనీయము. ఇది దైవికము. శ్రీమహారాజ్ఞిగారికిని

శ్రీరాజకుటుంబమువారికిని శ్రీభగవంతుఁడు తగినంతధైర్య మిచ్చుఁగాత. శ్రీరాజాబహద్దరుగారి కాత్మశాంతి కలుగుఁ గాత.

---

కటికినేని రామచంద్రరావుగారు,
మునిసిఫ్ & మేజస్ట్రీటు,
కొల్లాపురము.

అధ్యక్షమహాశయా! ఆర్యులారా!

శ్రీ శ్రీ రాజా ఐ. వి. కృష్ణారావుబహద్దరుగారి యకాలమరణము ప్రారంభమునఁ గలలోనివార్తవలెఁ దోఁచినది. ఇది నిజమని తెలిసినప్పుడు దుఃఖించని మానవుఁడు లేఁడు.

శ్రీవారు 19 సంవత్సరముల ప్రాయమునఁ గొల్లాపురమునకు వచ్చిరి. శ్రీ జటప్రోలుసంస్థానాధీశులగు శ్రీ శ్రీ వేంకటలక్ష్మారావుబహద్దరుగారికి మేనల్లుఁ డగుటయేగాక జామాత యగుభాగ్యమును వీరు పొందిరి. సంస్థానమునకును శ్రీవారికిని గలయీనూతనసంబంధమె యిక్కడిప్రజలకు శ్రీవారితోఁ బరిచయము గలిగించినది. శ్రీవారి నిష్కపటహృదయము, సత్యసంధత, దాతృత్వము, న్యాయవిచక్షణ, నిరాడంబరజీవితము, సాటిలేనిశూరత్వము - వేయేల శ్రీవారియందుఁ గలసద్గుణపుంజములె యిక్కడి ప్రజల

హృదయములో శ్రీవారియెడల వినయవిధేయతలు, భక్తి విశ్వాసములు కల్పించినవి. ఇక్కడి ప్రజలకు శ్రీవారి యందుఁ గలవాత్సల్యము మానసగోచరమేకాని చెప్ప నలవికాదు. శ్రీవారిసద్గుణములు లోకవిదితములు. శ్రీవారి వియోగపరితాపముచే నిండియున్నహృదయముతో నే నిప్పు డేమి చెప్పఁగలను? శ్రీవారితోఁ గలసి మాట్లాడిన వార లెల్లరు వా రేతరగతి యేజాతిమతమునకుఁ జెందిన వా రైననుసరే సారెసారెకు దర్శింపవలయుననియే కోరు చుండెడివారు. వా రొకరియాపదను జూచి సహించలేకుం డిరి. బీదలపాలిటి కల్పవృక్షము. విద్యార్థు లనేకులు శ్రీవారి సాహాయ్యముచే విద్య నభ్యసించుచుండిరి. నిరుద్యోగు లుద్యోగములను సంపాదించుకొనుచుండిరి. అన్నవస్త్రము లకుఁ దల్లడిల్లువారు సుఖజీవనమును బడసిరి. ఈనిదర్శనం బులు శ్రీవారియుదారగుణదాతృత్వములను జెప్పక చెప్పు చున్నవి. కొల్లాపురమే జన్మభూమిగా భావించి తత్ప్రజల యభివృద్ధికై శ్రీవా రెన్నియోవిషయములను యోజించు చుండిరి. సంస్థానప్రజలకు ముఖ్యముగా వెలమవిద్యార్థులకు నున్నతవిద్యను గఱపుట కెంతయో చేయూఁత నిచ్చుచుండిరి.

శరీరబలము, శౌర్యము, సదయత ప్రపంచములో నేజాతియందు లేదో యది స్వతంత్రతను గౌరవమును సంపాదించుకొనలేదనియు, నున్నదానిని నిలుపుకొనఁజాల దనియు శ్రీరాజావా రెఱింగియుండిరి. బాలుర కిట్టిగుణము లలవడుటకై నూతనపురాతనానేకక్రీడావకాశములు శ్రీవారే

తగినప్రోత్సాహ మిచ్చి కల్పించియుండిరి. శ్రీవారు సహజ శూరశిఖామణు లగుటచేఁ బ్రపంచ మంతయు శౌర్య గుణసంపద్విభవాభిరామముగ నొనర్పవలయునని సమకట్టి యుండిరి. బాల్యమునుండియు శ్రీవారికి శూరక్రీడలయం దాసక్తి మెండు. నేఁటినాగరకతకు సంబంధించినయాట లన్నిఁటియందును శ్రీవారు ప్రవీణతఁ గాంచియుండిరి. గుఱ్ఱపుసవారియందు వీరికిఁగలనేర్పు వర్ణనాతీతము. 'పోలో' మంచిగ నాడెడువారు. వేఁటలో నసమానప్రజ్ఞ గలవారు. పులివేఁటలో శ్రీవారి పరాక్రమప్రదర్శనము చూచినవారిని విన్నవారినిఁగూడ నాశ్చర్యమగ్నులఁ జేయకమానదు. సిద్ధారం చెఱువునకు సమీపమునం దొకయరణ్యప్రాంతమున నొకప్పు డొకదెబ్బలిని రాత్రియందు సంహరించిరి. ఆపులి యాదెబ్బకుఁ జచ్చియుండలేదని నౌకరులు సంశయింప శ్రీవారే స్వయముగ నిర్భయముగ నొంటరిగ దానిని సమీపించి దగ్గఱ నున్నవారికిఁ జూపించిరి. ఇది సాహసములలో సాహసమనక తప్పదు. మఱియొకపర్యాయము సంస్థానముసమీపమున నున్నయడవులలో భూమిపైఁ గూర్చుండియే మిక్కిలి సమీపించిన పులిని గాల్చిరి. అది మాటులో దూఁకి రెండవదెబ్బతోఁ బ్రాణములను వదలెను.

శ్రీవారు సైనికశిక్షను బొందియుండిరి. శ్రీవారిశౌర్యమే శ్రీవారిదృష్టిని వాయువిమానములపైకిఁ ద్రిప్పెను. కొలఁదిదినములకే శ్రీవారు విమానములను స్వయముగ

నడపుశక్తిని గాంచిరి. అచిరకాలమున దానిలో గొప్ప ప్రజ్ఞావంతు లన్నకీర్తిని సంపాదించుకొనిరి.

(శ్రీ)వా రొకప్పుడు 'అలహాబాదు'నకు విమానములోఁ బోవుచుఁ దుపానులోఁ జిక్కుకొని తప్పించుకొనిరి. విమానయానము ప్రమాదకరమగువిషయమని శ్రీవారెఱుంగనిది కాదు. కాని శ్రీవారి సహజపరాక్రమము శ్రీవారి దృఢసంకల్పమునుండి మనస్సును జలింపనీయకుండెఁ.

శూరుఁడు తనజీవితములో నొకసారియే మరణించుననియు, దానికొఱ కొకసమయము నిర్ణయింపఁబడియున్నదనియు, నది తప్పదనియు, నందుకై చింతింప నవసరము లేదనియు శ్రీరాజావారు తరచుగ సెలవిచ్చుచుండెడివారు.

ఇట్టి శ్రీవారినిఁ గన్నతల్లియే వీరమాత. చేపట్టిన యర్ధాంగలక్ష్మియే వీరపత్ని. శ్రీరాజావారిచే దేశమున కెంతయో మహోపకారము కలుగవలసియుండెఁ.

ఇట్టిమహావీరుని, మహాదాతను, సుగుణరాశిని గోల్పోవుట దేశముయొక్క దౌర్భాగ్యము. వేయేల? శ్రీరాజావారి యకాలమరణముచే శ్రీరాజకుటుంబమువారికే కాదు; ఆంధ్రదేశమునకు ముఖ్యముగాఁ బద్మనాయకజాతికిఁ దీఱని నష్టము వాటిల్లినది.

భగవంతుఁడు శ్రీవారియాత్మకు శాంతి ననుగ్రహించుఁ గాక!

---

వలిపె వేంకటరావుగారు,

హైకోర్టువకీలు, కొల్లాపురము.

శ్రీరాజా ఇనుగంటి వేంకటకృష్ణారావుబహద్దరుగారు మనకుఁ జిరస్మరణీయులు. 'జాతస్య మరణం ధ్రువ' మను వార్యోక్తి ననుసరించి ప్రతిజీవికిని జన్మించినతరువాత మరణించుట సహజమైయున్నది కాని, యొకపరోపకారదీక్షారతుఁడును, ధైర్యసాహసఖనియు, నుదారగుణసంపన్నుఁడును, సర్వకలాకోవిదుఁడును, నపూర్వప్రజ్ఞాసమన్విత మేధావియు నగు మహారాజచంద్రుఁ డకాలమరణమునకు గుఱియగుట ప్రజాదౌర్భాగ్యముగాక వేఱుకాదు. నిష్ప్రయోజకు లగుమనుష్యపశువులు లక్షలుగ నుండి భూమికి భారము గల్పించుటకన్న శ్రీరాజావారివంటిసద్గుణగణగరిష్ఠుం డొకఁ డున్ననుజాలు. ఇట్టిమహనీయు లుండుట విశ్వంభరాకాంతకు భాగ్యోదయ మనక తప్పదు. ఈకారణము వనే శ్రీవారిమరణము దుస్సహము. అన్నిఁటికన్న శ్రీరాజావారివిమానయానము శ్రీవారిసహజశౌర్యంబును గాంభీర్య పటిమమును బ్రదర్శించెడిని.

ఆబాలగోపాల మిచ్చట నీసమయంబున గుమిగూడి తమతమవిషాదమును వెలిపుచ్చుటయును, నేతన్మరణానంతర మింతదనుక వివిధపత్రికాలోకవిచారనిర్వచనంబును శ్రీవారి యఖండశేముషీవిభవాతిశయంబులకుఁ దార్కాణము. వివిధ దేశీయసార్వజనసంశ్లాఘ్యుం డగుమనరాజచంద్రుని మరణోదంతము మఱపురానిది.

" అస్థిరం జీవితం లోకే । హ్యస్థిరం ధనయౌవనమ్
అస్థిరం దారపుత్రాద్యా । ధర్మకీర్తిద్వయమ్ స్థిరం ".

అనునభియుక్తోక్తిప్రకారము శాశ్వతములగు ధర్మకీర్తులనే ప్రధానలక్ష్యములుగ భావించి ధనయౌవనదారపుత్రాదికమంతయు క్షణభంగురమని యెంచి జీవితకాలమంతయును గడపి ధర్మపథానువర్తియై కీర్తిసంపన్నుఁడగు మనరాజచూడామణినిఁ గోల్పోవుట దుర్భరముగదా. శ్రీపరాత్పరుఁడు శ్రీరాజావారికి వైకుంఠపదప్రాప్తియుఁ దదాప్తజనకుటుంబమునకుఁ జిత్తశాంతియు ననుగ్రహించుఁగాత.

---

## మహమ్మద్ అబ్దుల్ ఖయ్యూమ్ సాహేబ్,

హైకోర్టువకీలు, కొల్లాపురము.

(ఉర్దునకు ననువాదము)

ఈసమావేశము కీ॥ శే॥ శ్రీరాజా ఐ. వి. కృష్ణారావు బహద్దరువారి స్మరణసంబంధమైనది. శ్రీరాజావారు వర్తమానకాలమున లోకప్రసిద్ధిఁగాంచిన సర్వకళానిపుణులలో నగ్రగణ్యులు. శ్రీవారొక సామాన్యవాతావరణగతప్రదేశమున నివాసముచేయుచున్నవారయ్యు నపూర్వవైజ్ఞానికనాగరకతావిశేషపూరిత మగువాతావరణము గలయనేకపట్టణములయందలి ముఖ్యస్థలమహాకార్యక్రమములయందుఁ బాల్గొనుటయే వారి వైదుష్యమును సర్వకలాకోవిదత్వమును విజ్ఞానమును స్పష్టపఱచుచున్నది. తలవనితలంపుగా

స్వల్పకాలములో వీ రొకమహాశ్చర్యకరమై నూతనసృష్టియైన విమానయానమునందు నారితేఱిన నేర్పరులై పరిపూర్ణానుభవమును సంపాదించిరి. ఈవిమాన మనుపేరు మాత్రము మనదేశమందు వినుచుఁ దత్సందర్శనకుతూహలులై, యాందోళనాపరవశులై యుండిన ప్రజలదృష్టిపథమ్మునకు శ్రీవారు సంకల్పసిద్ధిరీతిగా నీయపూర్వదృశ్యమును బ్రదర్శనమాత్రమునఁగాక పిన్నపెద్దలగు దేశీయప్రజాసోదరుల కెల్లరకు భగవానునిసృష్టివైచిత్ర్యమును మానవుని కలానిపుణత్వమును స్పష్టీకరించిరి. శ్రీవా రెప్పుడును బరోపకారము ప్రజాసౌకర్యము ధర్మవర్తనము సత్యసంధత మొదలగు సుగుణగణములను దృష్టిపథమున నుంచుకొని ధైర్యమే ప్రధానభూషణముగఁ దాల్చి సంచరించిరి. వీరికీర్తి ఖండాంతరములకుఁగూడఁ బ్రాఁకినది. వీరిపవిత్రజీవితమును గుఱించియు సాహసమరణమును గుఱించియుఁ బ్రసిద్ధి దిశావలయంబున వ్యాపించెను. ఈసుప్రసిద్ధకీర్తి శాశ్వతముగ నుండఁగలదు. భగవంతుఁడు ప్రతిమానవునకు నిట్టిమరణానంతర ప్రశంసాపూర్వక మగుమృత్యువునే ప్రసాదించుఁగాత. కాని యీసందర్భమున శ్రీరాజావారు మధ్యమవయస్కులగుట వీరి మరణమునకు మాత్రము చింతిల్లక తప్పదు. భగవానుఁడు శ్రీవారికి వైకుంఠమును బ్రసాదించుఁగాత. తద్రాజకుటుంబమువారికిఁ దగిన ధైర్యము చేకూర్చుఁగాతమని యభిలషించుచున్నాఁడను.

---

## కటికినేని ఉమాపతిరావుగారు, బి. ఏ., కొల్లాపురము.

(ఉర్దునకు ననువాదము)

శ్రీ రాజా ఇనుగంటి వేంకటకృష్ణారావుబహద్దరుగారి యకాలమరణము మిక్కిలి శోచనీయమైనది. శ్రీవారి మరణము కొల్లాపురవాస్తవ్యులకును శ్రీరాజకుటుంబమువారికినే గాక ప్రపంచ మంతకును దీఱనివిచారమును గొఱుతను గలిగించినది. ఒకసామాన్యవ్యక్తి మరణించినచో నంతగా విషాదహేతువు కాకపోవుట యటుండఁ బ్రపంచమంతయు దుఃఖింపవలసినకారణ ముండదు. దేశాభివృద్ధికి మహాపురుషులజీవితము ముఖ్యము. అందు శూరశిఖామణు లాదర్శపురుషులు. ఒక దేశభక్తుఁడుగాని, ఒకమహావీరుఁడుగాని, ఒకయాదర్శపురుషుఁడుగాని మరణించిన దేశమున కెంతయు లోపమే. మనరాజా కృష్ణారావుబహద్దరువా రాతరగతికిఁ జేరినవారు. శ్రీవారి పరాక్రమము, సాహసము, పరోపకారబుద్ధి, వితరణశక్తి, యుదారభావము దిగంతముల మాఱుమ్రోగె. అట్టిఘనుని యకాలమరణమునకు లోకము శోకించదా? వేఁటయందు వీ రద్వితీయులు. విమానములను నడపుటయందును వేయేల సర్వకళలయందును, వీరారి తేఱినవారు. వీరి ప్రతిజ్ఞయుఁ బ్రతిభావిశేషములును గొప్పవి. వీరు చేపట్టిన ప్రతికళయందును లోకమున మొదటివారుగఁబరిగణింపఁబడవలయునన్నమహాశయముతోఁ బట్టుదలతోఁ బ్రాణ మర్పించియైనను విడువక పనిచేసి యందట్టివిజయమును గాంచుచుండెడివారు. 'ఇది అపాయకర

మగువిషయము; ప్రాణహాని కలుగు ' నని తెలిసినసంగతి యైనను శ్రీరాజావారి ధైర్యము వీని నన్నింటిని గెంటఁగల శక్తికలది. ఇదియేకదా శౌర్యము. ప్రాణ మేనాఁటికైనను నంత మొందునదె. అందు వీరకార్యములయందు జీవితమంత మొందినచో జన్మము సార్థకమగునుగదా. శ్రీరాజావారి యాత్మవిశ్వాస మింతదృఢమైనది. ఇట్టిమహనీయు లుద్భవించుటచేతనే దేశాభివృద్ధియు, నవనాగరకతయు హెచ్చుచున్నది. శ్రీరాజావారి యకాలమరణముచే నేఁడు ప్రపంచదృష్టిలో శ్రీవా రాక్రమించినస్థానము మఱియొకనిచేఁ బూర్తి చేయఁబడదన్న నెంతటినష్టము లోకమునకుఁ గలిగినదో యూహింపరానివిషయమని సర్వు లెఱింగినదే. భగవానుఁడు శ్రీవారి యాత్మకు శాంతిఁ బ్రసాదించుఁగాక !

"One crowded hour of glorious life
Is worth an age without name."

* * *

బ్రహ్మశ్రీ వనం సీతారామశాస్త్రిగారు
శ్రీజటప్రోలుసంస్థానపండితులు.

శ్లో. విమానచరసంసేవ్యం । సన్మాన్యం సత్యసంగరమ్
కృష్ణం భూతదయాసక్తం । స్మరంతు హితకాంక్షిణః.

భరతఖండమున విమానచారులలో నగ్రగణ్యులని ప్రసిద్ధిఁగాంచి భూలోకధీరశిఖామణి యని యెన్నఁదగిన ధైర్యప్రతాపశాలియగు శ్రీరాజా ఇనుగంటి వేంకటకృష్ణారావుభూపతి విమానచారియై భూలోకము వదలి స్వర్గమలంకరించెననెడి కర్ణకఠోర మగువార్త వినవలసివచ్చెఁ

గదా. సుకృతీ గతాయుః- పుణ్యాత్ములు దీర్ఘాయుష్యము గాంచి జీవించుట దుర్లభము- ఇట్టి ఘోరవార్తను విని జను లెల్లరు మితిలేనిదుఃఖమున మునుంగుచుండ నామహనీయుని భృత్యమిత్రాశ్రితవర్గసంతాపమునకు మేర యెక్కడిది? ఇట్టిమహాత్ముని గోల్పోయిన తదీయపుత్రకళత్రబంధుసమి తికి శోకసాగరమునకుఁ బార మెయ్యది? "ప్రతికూలతా ముపగతేహి విఫలత్వ మేతి బహుసాధనతా" అనున్యాయ మున దైవము ప్రతికూలుఁడైనప్పుడు బాధించకుండ నెంత సాయ మున్నను గార్యము కొనసాగదు. విమానసారథి యసమాననైపుణ్యశాలియని పేరు మోసినవాఁడు. ఎట్టి ప్రమాదమైనను దొలఁగింపఁగలసమర్థత గలవాఁడు. ఇట్టి చతురసారథిసాహాయ్యము గలిగి తా మంచ దతి నిపుణులై యుండియుఁ బ్రమాదమును దప్పించుకొనలేకపోవుట దైవ కార్యమనియే చెప్పవలయును. "అధీత మధ్యాపిత మార్జితం యశః" అనునట్లు శ్రీరాజాగా రసమానధైర్యప్రతాప శాలియై పుత్రపుత్రికాసంపద నొంది ధర్మార్థకామము లైన త్రివర్గములఁ బరిపూర్ణముగ సాధించిరి. సావిత్రి, అనసూయ, అరుంధతి మొదలగు సతీరత్నములకక్ష్యలోఁ జేరి ప్రసిద్ధిఁ గాంచిన వీరియర్ధాంగలక్ష్మి కిట్టిపతివియోగదుఃఖ మేర్ప డుట పూర్వకృతపరిపాకము! శ్రీమహారాజ్ఞిగారికి మన శ్శాంతి కలుగుఁగాక! జగదీశ్వరుఁడు శ్రీరాజాగారి కాత్మ శాంతియు, రాజకుటుంబమునకు శ్రేయఃపరంపరయు నొసం గుఁగాత మనిప్రార్థించుచున్నాను.

---

